*Telugu Dialect Bulletin Series - 7*

# తెలుగు మాండలికాలు

## శ్రీకాకుళం జిల్లా

సంపాదకుడు

డా॥ బూదరాజు రాధాకృష్ణ




తెలుగు అకాడమి

హైదరాబాదు

1984

Telugu Dialect Bulletin Series VII (Srikakulam District) : telugu maanDalikaalu (SriikaakuLam jillaa), Editor : Dr. B. Radhakrishna, First Edition, 1984, pp : viii + 72.





Frist Edition : 1984
Copies : 1,000



Price : Rs. 10-00

---

Printed in India
Printed at Lakshmi Shylaja Printing Press, Hyderabad-500 004,
Andhra Pradesh.

# సంపాదకీయం

తెలుగు అకాడమి సామాజిక భాషాపరిశీలన ఫలితంగా వెలువరిస్తున్న తెలుగు మాండలికాలనే గ్రంథ పరంపరలో ఇది ఏడోది. ఇప్పటికి కరీంనగర్ (1971), కడప విశాఖ, గుంటూరు (1972), వరంగల్ (1977), చిత్తూరు (1988) మాండలికాల మీద ఇప్పటికి ఆరు గ్రంథాలు ప్రచురించాం. విశాఖమాండలికం ప్రచురణకాలంనాటికిగాని, ఈ శ్రీకాకుళం మాండలికంకోసం విషయసేకరణ చేసేనాటికిగాని విజయనగరంజిల్లా ఏర్పడ లేదు. 1979 జూన్ 1 వ తేదీ నుంచి విజయనగరం అనే ప్రత్యేకజిల్లాను ఈ రెండు జిల్లాల నుంచి విభజించి ఏర్పాటుచేశారు. అందువల్ల ఈ గ్రంథంతో ఆంధ్రప్రదేశ్‌లోని కళింగ ప్రాంత మాండలికభేదా లన్నిటినీ స్థూలంగా పరిశీలించడం పూర్తయిందనే చెప్పాలి. ప్రత్యేకంగా విజయనగరం మాండలికంమీద మరో గ్రంథాన్ని ప్రచురించటం ఈ కారణంవల్ల అవసరం లేదనిపిస్తున్నది.

శ్రీకాకుళంజిల్లాలో పర్యటన పరిశోధన చేసినవారు కుమారి ఉషా పన్నాల. పర్యటన రెండుదశల్లో జరిగింది. 1978 నవంబరు నుంచి 1979 మార్చిదాకా మొదటి విడతలో ఎనిమిది కేంద్రాలనుంచి విషయసేకరణ చేసినా, 1981 దాకా మిగిలిన రెండు కేంద్రాలకు పోవడం సాధ్యంకాలేదు. 1979–81 మధ్యకాలంలో ఈ ఉద్యోగిని గోండీ, కోయభాషలు రెంటినీ అధ్యయనంచేసి ఆ రెండు గిరిజన భాషలకూ తెలుగు లిపిలో రెండేసి వాచకాలు సిద్ధం చేయటంలో సాయపడవలసి వచ్చింది. ఈ అడ్డంకివచ్చినా 1981 జూన్ నాటికి సిద్ధమైన ఈ గ్రంథాన్ని అనివార్యకారణాలవల్ల ఇప్పటికి ప్రచురించగలుగుతున్నాం.

ఈ గ్రంథంలో శ్రీకాకుళం-గుంటూరు జిల్లాల వ్యావహారిక శైలీ విశేషాలను చర్చించిన శ్రీ ఎస్. శంకరమోహనరావు వ్యాస మొకటి, వరంగల్-శ్రీకాకుళం జిల్లాలవాడుకను తులనాత్మకంగా పరిశీలించి రాసిన శ్రీ పులిగడ్డ శివానందశర్మ వ్యాసమొకటి ఉన్నాయి. తక్కిన గ్రంథమంతా కుమారి ఉషాపన్నాల రాసిందే. వీరికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ముద్రించిన శ్రీ లక్ష్మీశైలజ ప్రెస్, హైదరాబాద్ వారికి, మాండలిక రేఖాపటం గీసిన చిత్రకారుడూ శ్రీ బి. ఎ. వెల్లింగ్‌టన్‌గారికి మా కృతజ్ఞతలు.

# విషయసూచిక

# శ్రీకాకుళం జిల్లా




ఒరిస్సా రాష్ట్రం
పార్వతీపురం
ఒరిస్సా రాష్ట్రం
పాతపట్నం
పాలకొండ
బొబ్బిలి
సాలూరు
ఇచ్ఛాపురం
సోంపేట
టెక్కలి
నరసన్నపేట
శ్రీకాకుళం
బంగాళాఖాతం
విశాఖపట్నం జిల్లా

# 1
# విషయ సేకరణ

ఈ మాండలిక పరిశోధన చేయటానికి శ్రీకాకుళం జిల్లాలో పర్యటించి భాషాసమాచారాన్ని సేకరించడం జరిగింది. 1979 లో విజయనగరం జిల్లా ఏర్పడకముందు ఉన్న పాత శ్రీకాకుళం జిల్లానే తీసుకోటం జరిగింది. అవి 1) ఇచ్ఛాపురం, 2) సోంపేట, 3) టెక్కలి, 4) నరసన్నపేట, 5) శ్రీకాకుళం, 6) పాతపట్నం, 7) పాలకొండ, 8) పార్వతీపురం, 9) బొబ్బిలి, 10) సాలూరు తాలూకాలు. ఒక్కొక్క కేంద్రంలో నలుగురు చొప్పున మొత్తం 40 మంది వ్యవహర్తలనుంచి విషయ సేకరణ చేయడం జరిగింది. అక్కడి భాషాప్రామాణ్య నిర్ధారణకు తోడ్పడే విద్యాసాంఘిక సంబంధాల దృష్ట్యా వ్యవహర్తలను ఎంపిక చేసుకోడం జరిగింది. దాదాపు ప్రతి కేంద్రం లోను ఒక నిరక్షరాస్యుని తీసుకోటం జరిగింది. అక్షరాస్యతా స్థాయి దృష్ట్యా వ్యవహర్తలను మూడు రకాలుగా వర్గీకరించడం జరిగింది.

1) ప్రాథమిక విద్య గలవారు.

2) మాధ్యమికస్థాయినుంచీ పట్టభద్రుల వరకు.

3) వృత్తి విద్యలు అభ్యసించినవారు (డాక్టర్లు, ఇంజినీర్లు), స్నాతకోత్తర విద్యను అభ్యసించినవారు.

సమాచార సేకరణ నిమిత్తం తయారు చేసిన ప్రశ్నావళి ద్వారా ఒక్కొక్క వ్యవహర్తనుంచి భాషాసమాచారం సేకరించడం జరిగింది. ఇదే కాక ప్రతిఒక్క వ్యవహర్తను మాట్లాడించి టేప్‌రికార్డ్ చేయడం జరిగింది. టేప్‌రికార్డర్ చేసేటప్పుడు వ్యవహర్తతో తనకు నచ్చిన లేదా చెప్పగలిగిన విషయంమీద సాధ్యమైనంత కలుపుగోలుగా మాట్లాడించడం జరుగుతుంది. ఈ సేకరణలో అధిక శాతం విద్యావంతులనుంచే సేకరించడం జరిగింది. ఈ బులెటిన్ కోసం ఇద్దరు వ్యవహర్తల వ్యవహార ఖండికలు మాత్రం పూర్తిగా పరిశీలించడం జరిగింది. ఇది వ్యాకరణానికే ప్రాధాన్యమిచ్చిన సర్వే అయినప్పటికీ వి.సి. బాల కృష్ణశర్మ రాసిన "శ్రీకాకుళం ప్రజల భాష" నుంచికూడా కొంత పద జాలాన్ని తీసుకోటం జరిగింది.

## 2

# శ్రీకాకుళం జిల్లా

శ్రీకాకుళం జిల్లా ఆంధ్రప్రదేశ్ కు ఉత్తరంగా తూర్పుతీరాన ఉంది. ఈ జిల్లాకు ఉత్తరాన ఒరిస్సా రాష్ట్రంలో కోరాపుట్ జిల్లా పడమట గంజాం జిల్లా. తూర్పున బంగాళా ఖాతం, దక్షిణాన విశాఖజిల్లాలు ఉన్నాయి. ఈ జిల్లా ఏజెన్సీప్రాంతంగా తీరమైదానంగా విభాజితం అయింది. పాలకొండ, సాలూరు, పార్వతీపురం తాలూకాలోని కొంతభాగం, పాతపట్నం, సోంపేట తాలూకా లోని కొండప్రాంతాలు ఏజెన్సీ ప్రాంతంగా పరిగణింపబడినవి. ఈ జిల్లాలో వంశధార, నాగావళి, మహేంద్రతనయ, బాహుద, సువర్ణముఖి, గోముఖి, వేదవతి, చంపావతి నదులు ప్రవహిస్తాయి. వేగవతి నదిని 'ఝుంఝూవతి' అని, నాగావళిని 'లాంగుల్య' అనికూడా అంటారు.

ఈ జిల్లాలోని 11 (పాతలెక్క) తాలూకాలు మూడు రెవిన్యూ డివిజన్ల క్రింద ఉన్నాయి-

(i) టెక్కలి (సోంపేట, టెక్కలి, పాతపట్నం, ఇచ్ఛాపురం).

(ii) శ్రీకాకుళం (నరసన్నపేట, శ్రీకాకుళం, చీపురుపల్లి).

(iii) పార్వతీపురం (పాలకొండ, పార్వతీపురం, బొబ్బిలి, సాలూరు).

(ఈ మధ్యకాలంలో ఈ జిల్లాలోని కొన్ని తాలూకాలు, విశాఖపట్టణంలోని కొన్ని తాలూకాలు కలిపి విజయనగరం జిల్లా ఏర్పడింది). ఈ జిల్లాకు శ్రీకాకుళం ముఖ్యపట్టణం.

ఈజిల్లాజనాభారీత్యా రాష్ట్రంలో 5వ స్థానంలో ఉంది. ఈ జిల్లా (1981 నాటికి) మొత్తం జనాభా 19,02,941. ఈ మొత్తంలో షెడ్యూల్ కులాల జనాభా 9.2 శాతం, షెడ్యూల్ తెగల జనాభా 8,2 శాతం. మొత్తం జనాభాలో స్త్రీలు 9,96,491, పురుషులు 9,36,450. రాష్ట్రంలో గిరిజన జనాభా ఎక్కువగా ఉన్న జిల్లాలలో ఇది రెండవది. రాష్ట్రంలోఉన్న 33 తెగలలో ఇక్కడ 20 వరకూ ఉన్నాయి. మొత్తం జనాభాలో వీరు 8.2 శాతం. 20 తెగలవారి మొత్తం జనాభా 2,12.459. వీరిలో ప్రధానమయిన తెగలవారు సవరలు, కొండదొరలు, జాతవులు, గదబలు, ఎరుకలు, మన్నెదొరలు, మూకదొరలు, కొండలు, కోటియ రాష్ట్రంలో ఈ జిల్లా విద్యలో 13వ స్థానంలో ఉన్నది. మొత్తం జనాభాలో అక్షరాస్యుల ఖ్య 18.5శాతం. ఇందులో పురుషులు 27.7 శాతం, స్త్రీలు 9.8 శాతం

ఉన్నారు. 1973-74నాటికి 2,882 ప్రాథమిక పాఠశాలలు, 166 మాధ్యమిక పాఠశాలలు, 144 ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. 1975-76 నాటికి జిల్లాలో 18 కళాశాలలున్నాయి. వాటిలో 15 జూనియర్ కళాశాలలు, 3 డిగ్రీ కళాశాలలున్నాయి. శ్రీకాకుళంలో స్త్రీల కళాశాల ఉంది. ఇప్పుడు డిగ్రీకళాశాలలు చాలా తాలూకాలలో ఉన్నాయి.

ఈ జిల్లాలో ఆగ్నేయ రైల్వేవారికి చెందిన 236 కి. మీ. బ్రాడ్ గేజ్, 34 కి. మీటర్ల నారోగేజ్ రైలుమార్గాలు ఉన్నాయి. ఈ జిల్లాలో పాలకొండ, నరసన్నపేట పట్టణాలు తప్పించి అన్నిచోట్లకు రైలు సౌకర్యాలున్నాయి. అన్ని చోట్లకు బస్సుసౌకర్యం ఉంది.

ఈ జిల్లా పారిశ్రామికంగా చాలా వెనకబడింది. మాంగనీస్ గనులు జిల్లాలోని తొలి పరిశ్రమలు, జిల్లాలో పంచదార మిల్లులున్నాయి. పలాసాలో జీడిపప్పు పరిశ్రమ ఉంది. ఈ జిల్లాలోని చేనేత పరిశ్రమ ముఖ్యమైంది. పొందూరులో తయారయ్యే ఖద్దరు వస్త్రాలు చాలా ప్రసిద్ధమైనవి.

క్రీస్తు పూర్వంనుంచి ప్రసిద్ధంగాఉన్న ప్రాచీన ప్రాంతాలలో కళింగ దేశం ఒకటి. చరిత్ర పరిశీలిస్తే మహాభారతంలో దీర్ఘతమసుడనేవాడు అంగవంగ కళింగాలను ఏకదేశంగా పరిపాలించినట్లు ఉంది. కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఈ దేశంలో ఏనుగులు ఎక్కువ దొరుకుతాయని ఉంది (శ్రీకాకుళం చరిత్ర పేజీ 18). ప్రాచీన కాలంలో ఈ జిల్లా కళింగరాజ్యంలో అంతర్భాగం. క్రీ. పూ. 4వ శతాబ్దం నాటికే కళింగరాజ్యం కటక్ నుంచి పిఠాపురంవరకు విస్తరించింది. క్రీ.పూ. 467 నుంచి 336 వరకు కొంతభాగం నందరాజులు, మరికొంత భాగం మౌర్యులు కళింగాన్ని పాలించారు. తరువాత బౌద్ధ జైనాలు వ్యాపించిన అస్థిరపాలనా కాలంలో వైదిక ధర్మతత్పరుడయిన అశోకుడు దాడిచేశాడు. ఆ యుద్ధంలో జరిగిన పరిణామాలకు పశ్చాత్తాపం చెంది యుద్ధం విరమించి బౌద్ధమతాన్ని స్వీకరించి దాని వ్యాప్తికి తోడ్పడ్డాడు. మౌర్యసామ్రాజ్య పతనానంతరం క్రీ.శ. 183లో చేది వంశీయుడైన ఖారవేలుడు స్వతంత్రరాజ్యాన్ని స్థాపించాడు. ఇతని రాజ్యం గోదావరి వరకు వ్యాపించింది. ఖారవేలుని రాజధాని పర్లాకిమిడి దగ్గరగా ఉన్న ముఖలింగ నగరం. ఖారవేలుని తరువాత ఆంధ్రచక్రవర్తులయిన శాతవాహనులు కళింగ దేశాన్ని జయించారు. వీరివల్ల రెండు ప్రాంతాల (దక్షిణ కళింగానికి, ఆంధ్ర దేశానికి) ప్రజలలో ఐక్యత, ఉభయ సంస్కృతుల సమ్మిశ్రణం, తద్వారా నేటి ఆంధ్రజాతి సంస్కృతి రూపొందేందుకు తగిన అవకాశం కలిగింది. శాతవాహనుల పతనానంతరం కళింగరాజ్యంలో అనేక చిన్నచిన్న రాజ్యాలు తలెత్తాయి. క్రీ.శ. 343 లో సముద్రగుప్తుడు దండెత్తిననాటికి కళింగదేశాన్ని నలుగురు రాజులు పరిపాలిస్తూ ఉండేవారు. గుప్తులు 6వ శతాబ్దంవరకు రాజ్యంచేశారు. సముద్రగుప్తుడు దండయాత్ర చేసిన నాటికి ప్రధానంగా మాఠర వంశీయులు, వాసిష్ఠీవంశంవారు కళింగాన్ని పరిపాలించారు. వీరి రాజధాని తూర్పుగోదావరి

లోని పిఠాపురం,కాలంకాయనుల దాడివల్ల వాసిష్ఠివంశీయులు తమరాజ్యాన్ని శ్రీకాకుళం దగ్గర సింగుపురానికి, టెక్కలి సమీపంలోవున్న వర్ధమానపురానికి, పొందూరు సమీపంలోఉన్న సిరిపురానికి మార్చుకున్నారు. క్రీ.శ. 5వ శతాబ్దిలో విష్ణుకుండినులు విజృంభించి వాసిష్ఠివంశీయులనుంచే దక్షిణ కళింగాన్ని జయించారు. క్రీ.శ. 6వ శతాబ్దంలో గాంగశకం ఆరంభం అయింది. ఈ వంశీయులు సుమారు 35 గురు పదువందల సంవత్సరాలుపైగా కళింగదేశంలో చాలా భాగాన్ని పాలించారు. క్రీ.శ. 1434లో కపిలేంద్ర గజపతి అధికారం లోకి వచ్చేవరకు గంగరాజులే కళింగాన్ని పాలించారు.

క్రీ శ. 1520-22లో గోల్కొండ పాలకుడు కులీకుతుబ్‌షా శిఖాకోల్ సర్కారులను కూడా స్వాధీనం చేసుకున్నాడు. 1568 నాటి రాక్షసతగిడి యుద్ధం తరువాత వీరి అధికారం శ్రీకాకుళం జిల్లా దాటి గంజాం జిల్లాలో కొంతవరకు వ్యాపించింది. ఆ తరువాత అసఫ్‌జా వంశీయుడు నిజామ్-ఉల్-ముల్క్ ఈ ప్రాంతాన్ని పరిపాలించాడు. ఆ తరువాత కొన్నాళ్ళు విజయ నగరం పుసపాటిరాజుల ఆధీనంలో కొంతభాగం ఉండేది. చరిత్రనుబట్టి క్రీ.శ. 1742 లో జాఫరల్లీఖాన్, అబ్దుల్ ఖాన్ అనేవారు రాజ్యమేలినట్లు ఉంది. పూసపాటివారికి, నైజాంవారికి శ్రీకాకుళం విషయంలో ఎన్నో యుద్ధాలు జరుగుతూ ఉండేవి. 1743లో జాఫరల్లీఖానుని జయించి విజయరామరాజు చికాకోల్, హావేలీ పరగణాలకు అధిపతిగా అబ్దుల్ ఖాన్‌ను నియమించాడు. మధ్యయుగంలో శ్రీకాకుళం ప్రాంతం స్థిరమయిన పాలనలోలేదు. ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన రాజుల దాడిలో యుద్ధాలకు ఈ మండలం కేంద్రం అయింది.

నిజాం మరణానంతరం సలాబత్‌జంగ్ ఫ్రెంచిసేనాని బుస్సీ సహాయంతో (1753) రాజ్యానికి వచ్చాడు. ఫ్రెంచి సైనిక ఖర్చుల క్రిందని చెప్పి శ్రీకాకుళం సర్కారునుంచి కొండపల్లి సర్కారువరకు గల నాలుగు సర్కారులు (1753) ఫ్రెంచివారు దత్తమండలాలుగా తీసుకున్నారు.

ఈ జిల్లా చరిత్రలో ముఖ్యమయిన వాటిలో బొబ్బిలి యుద్ధం ఒకటి. మొదటినుంచి బొబ్బిలి రాజావారికి విజయనగరం రాజావారికి సరిపడేదికాదు. విజయనగరం రాజా ఫ్రెంచి సేనాని బుస్సీకి లంచంగా బంగారం పంపి బొబ్బిలి రాజాపైన దండెత్తేటట్లు చేశాడు. బుస్సీ కారణంగా విజయనగరరాజులకు, బొబ్బిలిరాజులకు మధ్య ఈ చారిత్రాత్మకమైన బొబ్బిలి యుద్ధం 1757 జనవరి 24 జరిగింది. ఈ యుద్ధం తరువాత బుస్సీ విశాఖపట్టణం, గంజాం ప్రాంతాలు ఆక్రమించుకున్నాడు. ఈ విధంగా ఈ జిల్లా కొంతకాలం ఫ్రెంచివారి కింద కూడా ఉంది.

ఆంగ్లేయులువచ్చి ఫ్రెంచివారిని తరిమేశారు. వీరిద్దరికీ 1758లో చందుర్తి దగ్గర జరిగినయుద్ధంలో ఫ్రెంచివారు ఓడిపోయారు. అప్పుడు నవాబ్

సలాబత్ జంగ్ ఫ్రెంచివారికిచ్చిన సర్కార్లను ఇంగ్లీషువారికి అప్పజెప్పాడు. అప్పటినుంచే శ్రీకాకుళం జిల్లా ఇంగ్లీషువారి పరిపాలనలోకి వచ్చింది.

ముస్లిం పరిపాలనాకాలంలో చికాకోల్ సర్కారు ఇచ్ఛాపురం, చికాకోల్, కళింకోట అని మూడు భాగాలుగా ఉండేవి. అందులో ఇచ్ఛాపురం, చికాకోల్ భాగాలు గంజాం జిల్లాలోను, కళింకోట విశాఖ జిల్లాలోను కలిపేశారు. 1936లో చెన్నరాష్ట్రంనుంచి ఒరిస్సా విభజించినప్పుడు గంజాంజిల్లాలోని దక్షిణ భాగాన్ని అంటే ఇచ్ఛాపురం, చికాకోల్ భాగాలు విశాఖజిల్లాలో కలిపారు. 1950లో విశాఖజిల్లాను విభజించి ఉత్తర భాగానికి శ్రీకాకుళం అని పేరు పెట్టారు. ఇటీవల శ్రీకాకుళంలోని కొన్ని ప్రాంతాలను, విశాఖపట్టణం జిల్లాలోని కొన్నిటిని కలిపి విజయనగరం జిల్లాగా పేరుపెట్టారు.

# 3

# శ్రీకాకుళం మాండలిక విశేషాలు

—ఉషా పన్నాల

భాషలో మార్పులు కలగడం సహజం. ఈ మార్పులవల్ల భాషలో అనేక రూపత ఏర్పడుతుంది. వీటికి అనేక కారణాలు ఉండవచ్చు. అవి సాంఘికం, చారిత్రకం మొదలుకొని ఏమైనా కావచ్చు. భాషలోని వైవిధ్యాలు ఒక నిర్దిష్టమైన ప్రాంతానికి పరిమితమైనప్పుడు అవి ప్రాంతీయ మాండలికాలు అని, ఒక వర్గానికి పరిమితమైనప్పుడు అవి వర్గమాండలికాలు అని అంటారు.

## వర్ణనిర్మాణం

ఈ మాండలికంలో ఆధునిక తెలుగు (ప్రామాణిక తెలుగు భాష)లో ఉన్నట్టు ఫ, ళ ఏ (ఙ) లను ప్రత్యేక వర్ణాలుగా గుర్తించవచ్చు.

| | |
|---|---|
| ప : ఫ | కాఫీ |
| | తాపీ |
| ల : ళ | బాళీ 'ముక్కు' |
| | పాళీ |
| ఏ (ఙ) : ఆ | పార |
| | ప్యార |

ఈ ప్రాంతంలో (నిరక్షరాస్యులలో) దీర్ఘాచ్చు తరువాత సంయుక్త వర్ణం 'న్గ' (ధ్వనివిధేయంగా జ్గ) ఉన్న పదాలుకూడా గమనించదగ్గవే.

| | |
|---|---|
| నాంగలి | 'నాగలి' |
| అలాంగ | 'అలాగ' |

కొన్ని సమయాలలో (నిరక్షరాస్యులలో) 'క' వర్ణంమీద 'అ' కారం 'ఓ' కారంగా ఉచ్చరితమవుతుంది. అప్పుడు అధరోష్ఠ్య 'వ' కారం ఆగమంగా వస్తుంది.

| | |
|---|---|
| కోవ్డలు | 'కోడలు' |
| కోవ్క | 'కోక' |
| కోవ్లాం | 'కులం' |

## ధ్వనిలో మార్పులు

| | పదాది | అజ్మధ్య |
|---|---|---|
| ప/క | పుడతలు-కుడతలు | |
| | చిన్నపంటకాలువలు | |
| ప/వ | | పసువు/పసుపు |
| వ/బ | బేపి/వేపి' కుక్క' | |
| బ/వ | | సబవు-సబబు |
| డ/ణ | | ముణుకు/ముడుకు |
| | | బొణిపె/బొడిపె |
| డ/ర | | పరమట/పడమట |
| డ/ళ | | తోళెం/తోడెం |
| క/స | | ముడుసు/ముడుకు |
| న/డ | | మడిషి/మనిషి |
| ద/జ | | పింజె/పందె |
| ర/ల | | బలువు/బరువు |
| న/ర | | పెరిమిటి/పెనిమిటి |
| న/ల | | దబ్బలం/దబ్బనం |
| ల/న | | నెమని/నెమలి |
| గ/వ | | తివ్వ/తీగ |
| బ/మ | | కనుమడు/కనబడు |

ఈ ప్రాంతంలో సాధారణంగా పదమధ్య, పదాంత 'గ' కారం లోపిస్తుంది.

బానే < బాగానే
పెరూతుంది < పెరుగుతుంది
ఇంకోలా < ఇంకోలాగా

ప/ఈ గా మారుతుంది

ఒచ్చీసీ < ఒచ్చేసి
అయ్‌పొయీసీవ్ < అయిపోసేవ్

ఓష్ఠ్యాల తరువాత 'అ' < 'ఒ' గా మారిపోతుంది.

పొందు < పండు
మొబ్బు < మబ్బు

## వ్యాకరణ భాగం

నామవిభాగం :

లింగవచన బోధక ప్రత్యయం 'ఉన్' క్రియ తరువాత అనుహాద్బహు వచన ప్రత్యయం 'యి'తోపాటు 'వి'కూడా ఉన్నది. ఈ ప్రత్యయం చాలా మటుకు భూతకాలంలోనే కనిపిస్తుంది.

ఉన్నావి/ఉన్నవి 'ఉన్నాయి'

విభక్తులు :

i) అన్నివర్గాల వారిలోను ద్వితీయావిభక్తిలో చతుర్థి విభక్తి ప్రత్యయం చేరుతుంది.

నాకు రమ్మన్నారు 'నన్ను రమ్మన్నారు'

దేవుడికి ఎంత ప్రార్థించినా 'దేవుణ్ని ఎంత ప్రార్థించినా'

ii) సప్తమీ విభక్తిలో 'లో, లోను-లోన,న' ప్రత్యయాలు చేరుతాయి.

ఊర్-లో

బస్సు-లోను

రాజ్యా-న

('న' ప్రత్యయం నిరక్షరాశ్యులలోనే కనిపించింది).

iii) తృతీయావిభక్తి ప్రత్యయంగా 'తో(టి)' చేరుతుంది.

కత్తి-తో(టి)

అందర్-తో(టి)

iv) పంచమీ విభక్తిలో రెండురూపాలు 'నుంచి, నుండి' ఉన్నాయి.

ఇక్కడ-నుండి/నుంచి

v) ఈ ప్రాంతంలో సంబంధ బోధక విభక్తిలో 'తాలూకా/తాలూకు' అనే అనుబంధం చేరుతుంది. ఇది అన్ని స్థాయిల వారిలోను ఉంది.

1. మీ తాలూకా పన్లు 'మీ పన్లు'

2. ఈనవారు మంచం తాలూక్ది.

నామపదబంధాలు :

ఒకే అర్థంగల రెండు మాటలతో కూడిన పదబంధాలు అదే అర్థంలో వ్యవహరించడం తెలుగులోఉంది. ఇటువంటి పదబంధాలలో సాధారణంగా ఒకటి దేశ్యం మరోటి అన్యదేశ్యం ఉంటాయి.

సిగ్గుషెరమ్ (సిగు-తెలుగు
షరమ్-హిందీ)

పేపర్ కాయితమ్ (పేపర్-ఇంగ్లీషు
కాయితమ్-హిందీ)

ఈ మాండలికంలో ఇటువంటి పదబంధాలు ప్రత్యేకార్థం సూచించేవి ఉన్నాయి. ఈ కింది మాటలు చూడండి.

దాల్-పప్పు (హిందీ-దాల్
పప్పు-తెలుగు)

గడే-కుండలు (హిందీ-గడా/గడే
తెలుగు-కుండ)

'దాల్-పప్పు'లో ఒకే అర్థం సూచించే రెండు భాషలకు చెందిన మాట లున్నాయి. ఈ రెంటితో కూడిన పదబంధం 'వండినపప్పు' అనే అర్థం సూచిస్తుంది. అదేవిధంగా 'గడే-కుండ' అన్న పదబంధం సన్నమూతిగల ఇత్తడిబిందె అన్న అర్థం సూచిస్తుంది.

*సంఖ్యావాచకాలు :*

ఈ ప్రాంతంలో సంఖ్యావాచకం తరువాత చేరే మహన్మహతీ ప్రత్యయం మూడు సంఖ్యనుంచి 'గురు' చేరుతుంది. పది తరువాత మాత్రం 'మంది' చేరుతుంది.

అతాలవ్యమైన పద్దెనిమిది మాత్రమే ఇక్కడ ఎక్కువగా ఉపయోగిస్తారు.

మహన్మహతీ ప్రత్యయం 'గురు' ముందు ఎనమండు, తొమ్మండు, పద్దెనమండు, పందొమ్మండు, రూపాలు ఎనిమిది, తొమ్మిది, పద్దెనిమిది, పందొమ్మిదికి పర్యాయ రూపాలు.

ఎనమండుగురు
తొమ్మండుగురు
పద్దెనమండుగురు
పందొమ్మండుగురు

*ద్విగు సమాసాలు :*

20 + 2 = ఇరవయ్ యిద్దరు
20 + 3 = ఇరవయ్ ముగ్గురు
20 + 4 = ఇరవయ్ నలుగురు

ఈ విధంగా 20 నుంచి 100 వరకు ఇద్దరు, ముగ్గురు, నలుగురు అనేవి చేరుతాయి. ఆపై మంది చేరుతుంది. ఈ ఇద్దరు, ముగ్గురు, నలుగురు (ప్రత్యయాలముందు) 'నూరు' శబ్దం ఔపవిభక్తిక రూపం 'నూట' ఉంటుంది.

*సర్వనామాలు :*

ప్రథమ పురుషలో 'అతడు, ఆమె' ఇక్కడ వాడుకలో చాలా తక్కువ. తరువాత ఆయన అన్న సర్వనామము సాధారణంగా భర్తని ఉద్దేశించినప్పుడే వాడుతారు.

అతగాడు 'అతను' అన్న సర్వనామము, 'తను', మహన్మహతీ సర్వనామ రూపం ఏకవచనంలో ఇక్కడి వ్యవహారంలో ఉంది.

*నిర్దేశక సర్వనామాలు :*

అల్లది 'అది', అల్లాడు 'వాడు', ఇల్లిది 'ఇది', ఇల్లీడు 'వీడు'కూడా ఇక్కడ వ్యవహారంలో ఉన్నాయి. ఇవి అల్ల, 'అక్కడ', ఇల్ల 'ఇక్కడ' అనే దూరార్థక, సమీపార్థక విశేషణాలమీద చేరి ఈ పదసంబంధాలు ఏర్పడ్డాయి.

*బహువచనరూపాలు :*

అక్కడ కొంతమంది వ్యవహారంలో చేతివేలు అన్న అర్థం ఇచ్చేమాటకు ఏకవచనంలో 'వేని/వేను' అనికూడా ఉచ్చారణ భేదాలతో ఉన్నది. కానీ ఈ రూపానికి బహువచనరూపం వేలు.

'చేను, పేను' కి ఈ ప్రాంతంలో నిత్యబహువచన రూపాలు చేలు, పేలు. వీటితోపాటు పునరుక్త బహువచన రూపాలు అయిన 'చేళ్ళు, పేళ్ళు' కూడా ఉన్నాయి.

నిరక్షరాస్యులలో ఏకబహువచనాల భేదం అప్పుడప్పుడు లోపిస్తుంది.

| | |
|---|---|
| ఒక నెమని | 'ఒక నెమలి' |
| రెండు నెమని | 'రెండు నెమళ్ళు' |

*క్రియా విభాగం :*

శిష్టవ్యవహారంలో తద్ధర్మార్థకంలో వ్యతిరేకార్థం సూచించడానికి సాధారణంగా కృత్తు తరువాత వ్యతిరేక క్రియ 'లేదు' చేరుతుంది. కాని ఈ ప్రాంతంలో చాలా మటుకు తుమర్థంలో 'లేదు' చేరుతుంది.

పూర్వం దొరికేవి ఇప్పుడు దొరక లేదు.

పూర్వం దొరికేవి ఇప్పుడు దొరకడం లేదు.

ఈ విషయంలో ఇది ఇక్కడ విలక్షణంగా ఉంది అని చెప్పవచ్చు. ఎందుకంటే ఈ నిర్మాణక్రమం (తుమర్థం + లేదు) సాధారణంగా తెలుగు భాషలో భూతకాలంలో వ్యతిరేకార్థాన్ని సూచిస్తుంది.

'పిలుచు, కలుసు' క్రియలు (కొందరి వ్యవహారంలో) వ్యతిరేకార్థక ప్రత్యయం ముందు 'పిల్, కల్'గా కూడా ఉంటాయి.

| | |
|---|---|
| పిల్ - లేదు | 'పిలవలేదు' |
| కల్ - లేదు | 'కలవలేదు' |
| పిలను | 'పిలవలేను' |
| కలను | 'కలవలేను' |
| పిలొద్దు | 'పిలవొద్దు' |
| కలొద్దు | 'కలవొద్దు' |

గమనిక : ఈ క్రియలు నిశ్చయార్థక ప్రత్యయం 'ఆలి', ప్రార్థనాద్యర్థక ప్రత్యయం 'అండి' ముందు కూడా ఇదే విధంగా ఉంటాయి.

భూతకాలంలో 'ఏ (ఈ,) ఏ, ఇనా' ప్రత్యయాలు చేరుతాయి.

అడిగే(ను),

అడిగినాను,

ఆలకించేరా.

నేను చెప్పేను

'ఇనా' ప్రత్యయం నిరక్షరాస్యులలో నిత్యం. అన్ని స్థాయిలవారిలోను మహతీవాచక ప్రత్యయం 'ది' ముందు 'ఉన్' క్రియ తరువాత 'ఇనా' చేరుతుంది.

ఉన్నాది

నిరతురాస్యులలో ఈ క్రింది నిర్మాణాలు కూడా ఉన్నాయి.

అ. పుట్టి-ఉందురు

పెంచి-ఉందును

ఆ. పెట్టుంటిని

## పదజాలం

1. ఈ మాండలికంలో అవశిష్టరూపాలు కూడా ఉన్నాయి.

ఉదాహరణకు :

| | |
|---|---|
| నూలు | 'నువ్వులు' |
| బైసి | 'సిగ్గు' |
| మట్టు | 'తొక్కు' |

2. ప్రాచీన సాహిత్యంలో ఉన్న ప్రయోగాలు నేటి శ్రీకాకుళం మాండలికవ్యవహారంలో కొన్ని ఉన్నాయి(చూ.సాహిత్యంలో ప్రయోగాలు.అ7)

3. కొన్ని మాటలకు ఈ ప్రాంతంలో కొత్తర్థాలున్నాయి.

ఉదాహరణకు :

అచ్చాణి 'ఎన్నికైనవారు'

నిఘంటువులో అచ్చాణికి 'స్వచ్ఛమైనది, శ్రేష్ఠమైనది' అని అర్థం. బహుశ అందరిలో శ్రేష్టమైనవారిని ఎన్నుకుంటారు కనుక ఇది అర్థవిస్తృతి చెందినదేమో.

కొన్ని మాటలు, నిఘంటువులో అర్థాలకు ఏకొద్ది సంబంధం లేకుండా ఉన్నవి కూడా ఉన్నాయి.

ఉదాహరణకు 'అడ్డ' అనే పదాన్ని చూడండి.

ఇది సాధారణంగా తెలుగులో ఒక కొలత విశేషం. మరి తెలంగాణాలో దీనికి స్థలమనే ఇంకో అర్థం కూడా ఉంది.

'నింబోలీ అడ్డ' అంటే హైదరాబాదులో ఒక స్థలనామము.

'రిక్షావాళ్ళ అడ్డ' అంటే రిక్షాలుఉండే స్థలం.

శ్రీకాకుళంలో ఇదే మాట మరో అర్థంలో వాడుతారు. ఇక్కడ 'అడ్డ' అంటే లైటు చిమినీ. ఇలాగే గోలికి సందు అని, డవులుకు రంగు అని అర్థాలున్నాయి. కానీ నిఘంటువులో గోలికి' కొండముచ్చు, గోరీ మార్బుల్ అనీ, డవులుకు అంచన, డాబు, రీతి అని ఉన్నాయి. కానీ గోలికి సందు అని, డవులుకి రంగు అన్న అర్థాలు మాత్రం నిఘంటువులో లేవు. ఇలా కొత్తర్థాలున్న మాటలు ఈ మాండలికంలో కనబడుతున్నాయి.

అన్యదేశ్యాలు :

అన్ని భాషలలో ఉన్నట్లు తెలుగులో కూడా దేశ్య అన్యదేశ్యాలు ఉన్నాయి. ఈ అన్యదేశ్యాలు అరబిక్, పర్షియన్, ఇంగ్లీషు మరాఠీ మొదలైన భాషలకి సంబంధించినవి ఉండవచ్చు.

హిందీ ఉర్దూ పదాలు : 13 వ శతాబ్దం నుంచి తెలుగులో హిందీ-ఉర్దూ మాటలున్నట్టు తెలుస్తోంది. ఈనాటికి చాలా మటుకు పరిపాలనకు సంబంధించిన పదజాలంలో ఉర్దూ, హిందీ భాషలకు చెందినవే ఉన్నాయి. అటువంటివి ఇక్కడకూడా ఉన్నాయనడం పెద్ద విశేషమేమీకాదు. కానీ వేరే మాటలు (కొత్తమాటలు, కొత్తర్థాలు ఉన్నవి) కూడా ఉన్నాయి.

అఖాడా 'నలుగురు కలిసి చిత్తమొచ్చినట్టు కాలక్షేపం చేసేచోటు'. ఈ మాట నిఘంటువులో ఎక్కడాలేదు.

ఒడియా భాష : ఈ జిల్లాకు ఒరిస్సా రాష్ట్రం ఒక సరిహద్దుగా ఉంది కనుక అక్కడి భాషాప్రభావం ఈ మండల భాషమీద ఉండడం సహజం. ఇక్కడ కొంతమంది తోడికోడలు అన్నఅర్థంలో 'జాదువ' అని అనడం ఉంది. ఒడియాలో 'ఝూ' అంటే తోడికోడలు. కనుక ఇది ఆభాషనుంచి ఎరువుతెచ్చుకొన్నమాటేనని స్పష్టంగా చెప్పవచ్చు. ఇలాగే తెలుగులో 'తరువాణి (అన్నం)' అన్నదానికి ఇక్కడ పర్యాయపదం పకాలి/ళి. ఇదికూడా ఒడియా మాటే. ఒడియాలో 'పఖాల్' అంటే ఆరాత్రి మిగిలిన అన్నం నీళ్ళల్లో వేసి పెట్టినది అని అర్థం. అలాగే బాలి 'ముక్క' దగ్గ 'పెంతండ్రి', కంబారు పనివాడు,' బెసారో/బెసారు 'అన్ని కలిపివండిన కూర' కూడా ఒడియా భాషనుంచి ఎరువుతెచ్చుకొన్న పదాలేనేమో.

సంబంధబోధక పదాల్లో కూడా ఒక కొత్తమాట ఉంది. ఇక్కడ అన్నదమ్ముల పిల్లలను గురించి చెప్పేటప్పుడు పుత్రాకూతురు, పుత్రాకొడుకు అని కూడా అనడం ఉంది. బహుశ ఇదికూడా ఒడియా సంప్రదాయమేమో.

ఇతర భాషల ప్రభావం :

ఈ జిల్లా కొంతభాగం కొండప్రాంతం. అక్కడ సవరలు, జాతాపులు మొదలయిన గిరిజనులు ఉన్నారు. ఇక్కడ నీటిపారుదల, వాగు, ఏరు అన్న అర్థంలో 'గడ్డ' అనే మాట వ్యవహారంలో ఉంది.

| | |
|---|---|
| ఒట్టిగడ్డ | నాగావళి ఉపనది |
| గడ్డ | పెద్ద పంట కాలువ |

ఈ రకంగా ఈ మాండలికంలో పరిశీలించదగిన అనేక విలక్షణాలున్నాయి.

4

# శ్రీకాకుళం-గుంటూరు జిల్లాల వ్యావహారిక శైలి విశేషాలు

— *ఎస్. శంకరమోహన్ రావు*

శ్రీకాకుళం జిల్లా కళింగాంధ్ర భాషా మాండలికానికి, గుంటూరు జిల్లా మధ్యాంధ్ర భాషా మాండలికానికి చెందిన రెండు ప్రధానమైన కోస్తా జిల్లాలు. ఈ రెండు జిల్లాల వ్యావహారిక భాష పరిశీలిస్తే వ్యాకరణ రీత్యా ఎంతో సామ్యం, పదజాలం దృష్ట్యా ఎంతో తేడా కనిపిస్తాయి. అయితే ఈ తేడాలు ఆయా జిల్లాల మాండలిక వైశిష్ట్యాన్ని ప్రతిబింబిస్తూ ఉన్నా, వ్యాకరణ సామ్యాలు తెలుగుభాష ఏకరూపతను సూచిస్తున్నవి. మాండలిక పదాలు ఎక్కువగా చదువురానివారు వినియోగిస్తున్నట్లు శ్రీకాకుళం జిల్లా వ్యవహారికాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ఈ రెండు జిల్లాల్లోని విద్యావంతుల భాషలో చాలావరకు ఏకరూపత పదజాలంలో కూడా కనిపించటం విశేషం. వీరి భాష చాలావరకు ఆధునిక తెలుగు ప్రామాణిక భాషకు దగ్గరగా ఉంది. ఈవ్యాసంలో ప్రధానంగా ఈ రెండు జిల్లాల్లోని అవిద్యావంతుల భాషాస్వరూపాన్ని పరిశీలిద్దాం.

## వర్ణ విభాగం

ఈ రెండు జిల్లాల్లోని అవిద్యావంతుల వ్యావహారికంలో ఈ కింది సామ్యాలు మనకు గోచరిస్తవి. వారి ఉచ్చారణలో మహాప్రాణం వినిపించదు.

ఉదా॥ ఖరీదు > కరీదు
భూమి > బూమి
లాభం < లాబం
ధర > దర

మూర్ధన్యాలు ఎక్కడోగానీ కనిపించవు. సాధారణంగా మూర్ధన్య లోపం జరుగుతుంది.

ఉదా॥ వెళ్ళు > ఎల్లు
ఆపరేషన్ > ఆపరేసన్
భాష > బాస

వీరు శ, ష, స వర్ణాలకు 'స' మాత్రమే వాడుతారు. అయితే విద్యావంతులు తమ భాషలో శ,స లకు మాత్రమే 'స' వర్ణాన్ని విరివిగా ప్రయోగిస్తారు. వీరి భాషలో 'ష' నిలిచి ఉంది.

ఉదా శక్తి < సెక్తి
శనివారం > సెనివారం
విషయం > విషయం

మహాప్రాణత్వం విద్యలేని వారిలో అసలు కనిపించదు. విద్యావంతుల్లో చాలాచోట్ల ఉంది. అయితే ఇది వీరిలో అప్పుడప్పుడు మాయమవటం కూడా మనం చూస్తాం. విద్యావంతుల్లోగూడా అప్పుడప్పుడు మహాప్రాణం తారుమారు చేసి వాడిన సందర్భాలు లేకపోలేదు. ఈ దశని మహాప్రాణత్వలోప సంకేతంగా మనం భావించుకోవచ్చు. ఇది మొత్తం తెలుగుభాష సాధారణ పరిణామ దశగా కూడా గుర్తించవలసి ఉంది. అలాగే పైన ఉదాహరించిన

శ
స > స పరిణామం కూడా.

ఈ రెండు జిల్లాల్లోని విద్యలేనివారి భాషలో చ > స కావటం, పదాది 'వ' కారం లోపించటం గమనించవచ్చు.

ఉదా॥ చ > స సెంబు (చెంబు)
సాలు (చాలు)
సేను (చేను)
వ > ϕ ఇత్తనాలు (విత్తనాలు)
ఆల్లు (వాళ్ళు)

*ధ్వనిభేదం :*

విద్యలేనివారి వ్యావహారికంలో ఈ కింది ధ్వనిభేదాలు శ్రీకాకుళం జిల్లాలో మాత్రమే కనిపిస్తున్నవి. ఇవి గుంటూరు జిల్లాలో కనిపించవు.

అచ్చులు :

అ > ఒ పాట్లు > పోట్లు
ఎ కష్టం > కెష్టం
ఇ ముసలి > ముసిలి
ఉ > ఒ కులం > కొలం
ఇ ఇద్దరము > ఇద్దరిమి
ఇ > ఉ ఇప్పుడు > ఉప్పుడు

హల్లులు :

ల > న లోటుపాట్లు > నోటుపాట్లు
ట/డ > న ఇవ్వటానికి > ఇవ్వనానికి
ర > ల ఎవరు > ఎవలు

సంయుక్తాక్షరాలు మధ్య అచ్చులను చేర్చి విడదీసి పలకటం ఈ రెండు జిల్లాల అవిద్యావంతుల్లో మనం చూస్తాం.

ఉదా॥ కోర్టు > కోరుటు

ఇస్త్రీ > ఇస్తిరి

శిష్ట వ్యావహారిక భాషలో 'చ' వర్ణం నిలుస్తుందనీ, మహాప్రాణ ప్రయోగం శిష్టులు మాత్రమే చేస్తారని భావించి చాలాసార్లు విద్యలేనివారు విద్యావంతుల భాషను అనుకరించబోయి తప్పులు చేయటం కూడా జరుగుతుంది.

| | |
|---|---|
| /చ/ | సార్లు > చార్లు |
| మహాప్రాణం తారుమారు | బాధ > భాద |
| | కథ > కధ > ఖద |

వర్ణసమీకరణాలు ఈ జిల్లాల్లోని అవిద్యావంతుల ఉచ్చారణలో ఈ మాదిరిగా ఉంటున్నవి. ఈ ఉదాహరణలు చూడండి.

*పురోగామి సమీకరణం :*

సత్యం > సత్తెం

పద్యం > పద్దెం

*తిరోగామి సమీకరణం :*

అర్ధరూపాయి > అద్దరూపాయి

## పద విభాగం

*విభక్తి ప్రత్యయాలు :*

శ్రీకాకుళం జిల్లా అవిద్యావంతుల వ్యావహారికంలో తృతీయావి అక్కడక్కడ 'తోని' ప్రత్యయం వాడటం గమనించవచ్చు. గుంటూరుజి 'తో' లేక 'తోటి' మాత్రమే కనిపిస్తుంది.

ఉదా॥ శ్రీకాకుళం : పిల్లతోని/తో

గుంటూరు : పిల్లతో/తోటి

అట్లాగే సప్తమీ విభక్తి ప్రయోగంలో శ్రీకాకుళం అవిద్యావంతు 'ల' ప్రత్యయం 'న' ప్రత్యయంతోపాటు వాడటం గమనించవచ్చు.

| *శ్రీకాకుళం* | *గుంటూరు* |
|---|---|
| కడుపుల | కడుపులో/లోన |
| కడుపున | కాలవగట్టున |
| గర్భాన | |

అనుబంధాలు (post position) చాలావరకు ఒకేరకంగా ఉపయోగించబడ్డాయి.

| | అవిద్యావంతులు | విద్యావంతులు |
|---|---|---|
| ఉదా॥ | కాడ | దెగ్గర |

| | |
|---|---|
| కాడికి | కంచే |
| మాటు | సారి మొ॥ |

ఈ రెండు జిల్లాల్లో క్రియా విశేషణాలు ఈ కింది విధంగా ఉన్నవి.

| శ్రీకాకుళం | గుంటూరు | |
|---|---|---|
| | అవిద్యావంతులు | విద్యావంతులు |
| ఇలా | ఇట్టా | ఇట్లా |
| అలా | అట్టా | అట్లా |

*క్రియావిభాగం :*

ఈ రెండు జిల్లాల్లోని అవిద్యావంతుల వ్యావహారికంలో భూత కాలిక ప్రత్యయమైన ఏ (ఙః) కనిపించదు. దానికి బదులు (ఇ) నా/న (i)**na**(:)/(ఇ)న్ (i)**n**-వాడుతారు.

| | అవిద్యావంతులు | విద్యావంతులు |
|---|---|---|
| ఉదా॥ | చేసినా | చేశాను/చేసేను |
| | వెళ్ళినా | వెళ్ళేను |
| | జల్లినా | జల్లేను |
| | వచ్చిండు | వచ్చేడు |
| | పోయిండు | పోయేడు మొ॥ |

అలాగే సమీప భూతకాలంలో 'ఉండు' క్రియను ఉపయోగిస్తున్నప్పుడు ధ్వని సమీకరణ జరుగుతున్నది.

| విద్యావంతులు | | అవిద్యావంతులు |
|---|---|---|
| ఉన్నది | > | ఉండది |

ఈ రెండు జిల్లాల అవిద్యావంతుల్లో భవిష్యత్ ప్రత్యయంగా త/ట ఉంటుండ. అదే విద్యావంతుల్లో తా/టా, తున్/టున్‌గా ఉంటుంది.

| | విద్యావంతులు | అవిద్యావంతులు |
|---|---|---|
| | అవుతుంది | అవతది |
| | పోతుంది | పోతది |
| | చేస్తుంద | చే స్తది |
| అలాగే | నిండుతుంది | నిండుతాది |
| | అడుగుతుంది | అడుగుతాది |
| | పడుతుంది | పడతాది |

విద్యావంతులు 'తున్' వాడేచోట అవిద్యావంతులు స్వరదీర్ఘత (vowel gradation) వల్ల 'తా' వాడటం ఈ పై ఉదాహరణల్లో మనం గమనించవచ్చు.

ఉత్తమపురుష ఏకవచన, బహువచన ప్రయోగాల్లో విద్యావంతుల, అవిద్యావంతుల మధ్య క్రమంగా అక్కడక్కడ ఏకరూపత కనిపిస్తూఉంది.

| విద్యావంతులు | అవిద్యావంతులు |
|---|---|
| చేస్తాను | చేస్తా(ను)/చే_స్త |
| వస్తాను | వస్తా(ను)/వ_స్త మొ॥ |

నిశ్చయార్థక క్రియ (obligatives) ప్రయోగంలో విద్యావంతులు 'ఆలి', విద్యలేనివారు 'ఆల' వాడటం చాలా విరివిగా మనం గమనించవచ్చు.

| | విద్యావంతులు | అవిద్యావంతులు |
|---|---|---|
| ఉదా॥ | ఉండాలి | ఉండాల |
| | పెట్టాలి | పెట్టాల |
| | తినాలి | తినాల |

అలాగే శత్రర్థక క్రియాప్రయోగంలో విద్యావంతులు 'తూ', అవిద్యావంతులు 'తా' ఉపయోగిస్తారు.

| విద్యావంతులు | అవిద్యావంతులు |
|---|---|
| వస్తూ | వస్తా |
| పోతూ | పోతా |
| చేస్తూ | చేస్తా |

అదేవిధంగా ప్రార్థనాద్యర్థక ప్రయోగంలో ఈకిందిసామ్యాలు విద్యలేని వారిలో కనిపిస్తవి.

లెగు 'లే'

కూకో 'కూర్చో'

ఈ విధంగా భాషాపరంగా చాలా చోట్ల గుంటూరు- శ్రీకాకుళం జిల్లాల అవిద్యావంతుల వ్యావహారికంలో సామ్య-వైవిధ్యాలు మనం చూశాం.

శ్రీకాకుళం జిల్లా వ్యవహర్తలు ఎక్కువగా తమ వ్యావహారికంలో 'వేయు' అనుబంధక్రియను ఉపయోగించటం జరుగుతుంది. ఇది గుంటూరు జిల్లాలో అంతగా కనిపించదు.

ఉదా॥ తినేసి వెళ్ళు...
చెప్పేసి...
వచ్చేసి ...

పదజాల ప్రయోగంలో ఈ రెండు జిల్లాల విద్యలేని వ్యవహర్తలు తమ తమ జిల్లాల మాండలిక పదాలు విరివిగా ఉపయోగించినా ఏకరూపతగల ఎన్నో పదాలు మనం చూడగలం. కొన్ని అలాంటివి పరిశీలిద్దాం.

| శ్రీకాకుళం | గుంటూరు |
|---|---|
| సొమ్ములు | గొడ్లు |
| తిన్నగా | చిన్నగా |
| బేగంగా | తొందరగా |

| | | |
|---|---|---|
| మందలు | మేకలు | |
| గేదె | బర్రె | |
| పిల్లడు | పిల్లగాడు | |
| అతగాడు | అతను | |
| పుచ్చుకోను | తీసుకోను | |
| బుర్ర | తల | |
| తొంగోను | పడుకోను | మొ॥నవి |

అలాగే ఒకే పదం వాడిన కొన్ని సందర్భాలు మచ్చుకుకొన్ని చూద్దాం.

ఉదా॥ కూడు
చానా
చెరుగు
కొట్టు
బస్తా
సోలెడు
అద్దెడు
తవ్వెడు

ఇంతవరకు మనం పరిశీలించిన భాషాపరమైన ఈ సంగ్రహ విశ్లేషణలో తెలుగుభాషా మాండలిక వైవిధ్యాన్ని, ఆదేసమయంలో ఏకత్వాన్ని ఒకేసారి గుర్తించవచ్చు.

# 5

# వరంగల్ - శ్రీకాకుళం జిల్లాల భాషలు

(ఒక తులనాత్మక పరిశీలన)

— శ్రీ పులిగడ్డ శివానందశర్మ

ఈ పరిశీలనకోసం కళింగ మండలంలో ఉన్న శ్రీకాకుళం జిల్లాలోని సోంపేట నుంచి ఒక స్త్రీ వ్యవహర్తనూ, తెలంగాణాలో ఉన్న వరంగల్ జిల్లాలోని మహబూబాబాద్ నుంచి ఒక పురుష వ్యవహర్తనూ ఎన్నుకున్నాను. వీళ్ళిద్దరూ యాదవ కులానికి చెందినవాళ్ళు. ఇద్దరికీ చదువురాదు. ఇద్దరూ యాభై సంవత్సరాల వయస్సుదాటిన వాళ్ళే. అయితే సోంపేట వ్యవహర్త వృత్తి పాలమ్ముకోవటం, మహబూబాబాద్ వ్యవహర్త వృత్తి కూలిపని చేసుకోవటం. సాధారణంగా కులాలనుబట్టీ, వయస్సులనుబట్టీ, విద్యాస్థాయిలను బట్టీ, నివసించే ప్రాంతాలను బట్టీ భిన్న వ్యక్తుల భాషల్లో తేడాలేర్పడతాయ్ కాబట్టి వాళ్ళకు గల భాషాభేదాలను ప్రాంతీయతకు మాత్రం పరిమితం చేసి శిష్టేతర భాషల్లో ప్రాంతీయపరంగా ఉన్న వైవిధ్యాలను పరిశీలించే ఉద్దేశంతో ఈ ఎన్నిక చేశాను. ఎన్నుకున్న వ్యవహర్తలిద్దరి భాషల్లోనూ ఉన్న సామ్యభేదాలనూ సాకల్యంగా తెలుసుకుందాం.

## వ్యవహర్తలిద్దరిలో ఉన్న సామ్యాలు

### *1. వర్ణనిర్మాణానికి సంబంధించినవి*

1. అ కారం ఒ కారంగా మారటం :

పదాదిలో మాత్రమే ఈ మార్పు కనబడుతున్నది. అది సోంపేట వ్యవహర్తలో అత్యధికంగా ఉంది.

(మ)* ఒల్లు (వోల్లు<వాల్లు<వాళ్ళు)

(సోం)* కొడుపు (కడుపు), కోన్పు (కాన్పు), చొదువు (చదువు), డొబ్బు (డబ్బు), పోలు (పాలు), బొతుకు (బతుకు), రోల్లు (రాల్లు<రాళ్ళు).

* మ = మహబూబాబాద్, సోం = సోంపేట.

2. ఇ కారం ఉ కారంగా మారటం :

(మ) దుక్కున (దిక్కున)

(సోం) ఉప్పుడ్కి (ఇప్పుడ్కి = ఇప్పటికి)

3. ఉ కారం ఇ కారంగా మారటం :

పదాదిలో కాక ఇతరత్రా ఈ మార్పు జరుగుతున్నట్లు అగుపిస్తుంది ఇదికూడా సోంపేట వ్యవహర్తలోనే చాలా ఎక్కువ.

(మ) కానిక (కానుక)

(సోం) అయ్‌పోయిందును (అయ్‌పోయుందును), టిక్కటి (టిక్కట్టు< టిక్కట్టు—ఆంగ్లపదం), పిలిస్తావ్ (పిలుస్తావ్), బస్సిలో (బస్సులో—ఆంగ్ల పదం). మూడి (మూడు).

4. ఒ కారం ఎ కారంగా మారటం :

(మ) బస్సులెచ్చినయ్ (బస్సులొచ్చినయ్), బస్సులెత్తే (బస్సులొత్తే< బస్సులొస్తే).

(సోం) అయ్‌పేయింది (అయ్‌పోయింది).

5. చ కారం స కారంగా మారటం :

(మ) సవరం (చవరం<చ్చవరం<తువరం), సుట్టాలు (చుట్టాలు).

(సోం) సెంబులు (చెంబులు), సెప్పు (చెప్పు!), సేసింది (చేసింది), దాసి—(దాచి).

6. పదాది వ కార లోపం :

(మ) ఇడ్చిపెట్టేసిన్ను (విడ్చిపెట్టేసిన్ను), ఇనేది (వినేది), ఏల (వేల<వేళ).

(సోం) ఆల్లు (వాల్లు<వాళ్ళు), ఎయ్ (వెయ్!), ఎల్తాను (వెల్తాను< వెళ్తాను).

7. హ కార లోపం :

ఇది పదాది, పదమధ్యాల్లో కూడా జరుగుతున్నట్లుగా కనిపిస్తుంది. కానీ పదాదిలో ఈ మార్పును సూచించేందుకు సోంపేట వ్యవహర్త భాషలో అవకాశం లభించలేదు.

(a) పదాదిలో - (మ) ఓటల్ (హోటల్).

(b) పదమధ్యంలో - (మ) నూటపదార్లు (నూటపదహార్లు)

(సోం) ఆర్మె (ఆరము<ఆహారము), దోయిం (దోఅం<దోహం< ద్రోహం).

8. మహాప్రాణలోపం :

(మ) కచ్చు (ఖచ్చు<ఖర్చు), కమ్మం (ఖమ్మం), దర (ధర), పబుద్ధుడు (పబుద్ధుడు<ప్రబుద్ధుడు), బద్రచల (భద్రాచలం<భద్రాచలం), బూమి (భూమి), బార్య (భార్య), ఎన్బై (ఎన్భై<ఎనభై),

(సో) సుకం (సుఖం), దనము (ధనము), దాన్యం(ధాన్యం), ఇంద్రాగాందమ్మ (ఇంద్రాగాంధమ్మ), పాబుత్వం (పొభుత్వం<పభుత్వం<ప్రభుత్వం) గర్బాన (గర్భాన), బూమి (భూమి), బాగ్యవంతుడు (భాగ్యవంతుడు).

9. మూర్ధన్యతాలోపం 

(a) ళ కారం ల కారంగా మారటం - 

ద్విత్వాలఘుళకారం ద్విత్వలఘులకారంగా మారటం తరచుగా జరుగుతుంది. ఇంతేకాక ళ, తలను సంయుక్తంగా పలకవలసి వచ్చినప్పుడు అలఘులకార స్థానంలో లఘులకారోచ్చారణ చెయ్యటం పరిపాటి.

(మ) పెల్లి (పెళ్ళి), మల్లా (మళ్ళా), వాల్లు (వాళ్ళు), నీల్లు (నీళ్ళు),

(సో) ఆడోల్లు (ఆడోళ్లు<ఆడవాళ్ళు), నీల్లు (నీళ్ళు), ఎల్తాను (<వెల్తాను<వెళ్తాను). 

10. పూర్ణానుస్వారం రావటం :

(మ) అనోంగనే (అనుకోగానే), ఉండంగ (ఉండగా), చిన్నంగా (చిన్నగ), నిండంగనే (నిండగానే), పెల్లిగాంగనే (పెళ్ళికాగానే).

(సో) అలాంగ (అలాగ), ఇలాంగ (ఇలాగ), ఎలాంగ (ఎలాగ), సరింగ (సరిగా).

11. వర్ణాలు సమీకరణం చెందటం :

(a) తిరోగామి సమీకరణం—

(మ) ఒత్తె (ఒస్తె<ఒస్తే), ఇప్పిత్తం (ఇప్పిస్తం), చవరం (చ్చవరం<క్షవరం).

(సో) తేత్తనే (తేస్తనే), లచ్చపెట్ను (లక్ష్యపెట్ను<లక్ష్యపెట్టను).

(b) పురోగామి సమీకరణం—

(మ) నరసిమ్మ (నరసింహ).

(సో) సిమ్మాచెలం (సింహాచలం).

పై (a) లో చివరి ఉదాహరణల్లో క్ష>క్ష లో షవర్ణం ముందుగా చవర్ణంగా మారి దానిముందున్న కవర్ణాన్ని కూడా చవర్ణంగా మార్చటం గమనించాలి.

12. సంయుక్తీకరణం :

(మ) అల్వాటు (అలవాటు), కొడ్కు (కొడుకు), కల్సినం (కలిసినం),

వాన్కి (వానికి), ఎక్రాలు (ఎకరాలు), అడ్గిన (అడిగిన), గిట్నే (గిట్టనే), చేస్నం (చేసినం), ఎత్కో (ఎత్తుకో), అన్కోంగనే (అనుకోంగనే), పెట్న (పెట్టిన), బత్క (బతక), పెడ్త (పెడత), మన్సులు (మనుసులు)

(సోం) నల్గురు (నలుగురు), మన్షి (మనిషి), కొంద్రు (కొందరు), ఉర్కు (ఉరుకు), కెష్టుమ్ (కెష్టము<కష్టము), ఎన్మిది (ఎనిమిది), ఎక్రాలు (ఎకరాలు), తొంద్రే (తొందరే), పర్క (పరక = అర్థణా), యజ్మాని (యజమాని), పుట్నాను (పుట్టినాను), బొత్కు (బొతుకు<బతుకు), గొర్లు (గొఱెలు), అడ్లు (అడ్డ( = 2 మానికలు)లు), పల్కుబడి (పలుకుబడి), ఉపార్కరం (ఉపకారం).

రెండో అక్షరంలో ఉన్న హ్రస్వాచ్చును తొలిగించటం కారణంగా ఈ రూపాలేర్పడుతున్నట్లు బోధపడుతుంది.

13. తాలవ్యీకరణం + వర్ణసమీకరణం :

యకారం ముందువచ్చే త, ద లు చ, జ లుగా మారతయ్. అప్పుడు ఆ తరువాత ఉన్న యకారం వాటితో సమీకరణం చెందుతుంది.

(మ) మజ్జ (మజ్య < మద్య < మధ్య)
(సోం) సచ్చం (సచ్యం < సత్యం)

14. శ్వాసం నాదంగా మారటం :

(మ) ఇగ (ఇక)
(సోం) ఇగ (ఇక). ఒగుడ్ దెగ్రా (ఒకడి దగ్గర)

15. అతిప్రమాణీకరణం/అతి నాగరికరణం :

(మ) చంపాయించుక్కుంటడో (సంపాయించుక్కుంటడో)
(సోం) (పద్) చార్లు (సార్లు)

16. సంయుక్త వర్ణాల్లో వర్ణలోపం :

(మ) తానం (స్తానం<స్నానం), పబుద్దుడు (ప్రబుద్ధుడు).
(సోం) ప్రాదించ్న (ప్రార్థించిన), రాజాన (రాజ్యాన), పొబుత్వం (ప్రబుత్వం<ప్రభుత్వం).

## 2. పదనిర్మాణానికి సంబంధించినవి

1. అధికరణకారకం (సప్తమి) :

(మ) పాకాల్ల, అందర్ల, ఇంట్ల, దుక్కున
(సోం) చెక్కల్ల, కోరిట్ల (కోర్ట్ = కోర్టు), ఊర్ల, గర్భాన

పై విధంగా -ల, -న అనేవి రెండు ప్రాంతాల్లోను ఉండగా, మ.లో -ఆల్ల కూడా ఉంది. (ఉదా : ఇండ్లల్ల)

2. సమీపార్థకం :

(మ) ఇంటికాడ, చేసిచ్చేకాడ, గుడికాడ
(సోం) దేవుడాక్కాడ, పుట్టిన్నాక్కాడ, పడిన్నాక్కాడ

3. ఉపర్యర్థకం :

(మ) గాడి ( = రైలు)మీద, కూల్పనిమీద ( = కూలిపనిమీద).
(సోం) మాట్మీద ( = మాటమీద)
మ.లో -మీద్కెల్లి అనేదికూడా వాడ్తారు. ఉదా : ఒక రెక్కమీద్కెల్లి ( = ఒకచేతిమీదుగా).

4. కరణకారకం (తృతీయ) :

(మ) మాతోని, వాల్లతోని, ఇస్టంతోని, ఒకర్తోని.
(సోం) పిల్లల్తోని.
మ.లో -తోటి కూడా వాడుకలో ఉంది. ఉదా : ఆయన్తోటి.
సోం.లో -తో మాత్రమే వాడిన సందర్భం ఒకటి ఉంది. ఉదా : ఎయొవుల్తో ( = ఎవరితో).

5. చేదర్థకం :

(మ) ఇస్తె, కొట్లాడ్తె, అంటె, చెస్తె;
పజ్జేస్తే, పుకాజ్రేత్తె
(సోం) ఒస్తే, కాచ్కుంటే, తోలేస్తే, పోతే;
ఉభయ కేంద్రాల్లోనూ -తే; -తె లు వాడుకలో ఉన్నా మ.లో -తె అనేదే, సోం.లో -తే అనేదీ అధికంగా వాడటం స్పష్టం.

6. క్త్వార్థకం :

(మ) పటోక్కని, చాదుకోని:
తోలి.
(సోం) అమ్మోక్కని, పుచోక్కని, (గం) పెటోక్కని, తిరుకోక్కని;
తెచ్చి, పెట్టి.
రెండుచోట్లా క్త్వార్థక ప్రయోగం చేసేటప్పుడు ఆత్మనే క్రియ వాడటం ఉన్నట్లు తెలుస్తున్నది.

7. వ్యతిరేక తద్ధర్మార్థకం :

(మ) బతక్క, తియ్య్య, ఇయ్యను, అమ్మం, పండదు.

(సోం) దెబ్బలాడున్న, లచ్చపెట్టున్న, ఒప్పుకోను, ఒప్పం, సెయ్యాం, ఇవ్వవ్, ఇవ్వోడు (<ఇవ్వడు), సాల్దు (<చాలదు) ఎల్రు (<ఎల్లరు<వెళ్ళరు)

ఉభయప్రాంతాల్లోనూ క్రియామూలంమీద అ చేరి ఆ పైన పురుష ప్రత్యయం చేరటం గోచరిస్తుంది. ప్రథమ పురుష ఏకవచనంలో పుంలింగేతరాలకు పురుషప్రత్యయంగా దు రావటం రెండుచోట్లా ఉంది. కానీ మ.లో -ది రావటం కూడా కనిపిస్తుంది. ఉదా : బాగుండది.

*3. పదజాలానికి సంబంధించినవి*

ఉర్కు-( = పరిగెత్తు), నాయ్న/నాయన, బూమి (పొలం,) తోలు-(పంపు) - ఇది మనుష్యులకు కూడా వర్తిస్తుంది.

| (మ) | (సోం) |
|---|---|
| ఉర్కురా, ( = పరిగెత్తుకునిరా) | గొల్లా! పాలున్నాయేమంటే గెటుక్కునుర్కొత్తం... |
| | పెండ్లాడాక్కడున్నంచి |
| వానిక్సెల్కలేదు, బూమిలేదు | పెల్లాడ్న పెన్విట్కి బూమిలేదు. |
| నాయన్జచ్చేక పెండ్లయింది | అమ్మానాయన్కి బూమిలేదు. |
| (బిడ్డనూ, అల్లున్ని) ఇండ్ల దోల్న | మరుసూర్మన్తోలేస్తె...ఎంశేడుస్తాది. |

## B వ్యవహర్త లిద్దరితో ఉన్న భేదాలు

### *1. వర్ణ నిర్మాణానికి సంబంధించినవి*

(a) మహబూబాబాద్ వ్యవహర్తలో మాత్రమే కనిపించేవి :

1. బహువచన ప్రత్యయాల ముందు య, జ ల లోపం :

రూపాలు (రూపాయిలు), రోలు (రోజులు).

2. వర్ణ వ్యత్యయం :

సదురుడు (సరుదుడు < సర్దుడు)

3. వర్ణ సమీకరణం :

తిరోగామి -

నిట్టూరం (నిష్ఠూరం < నిష్ఠురం), కచ్చు (కర్చు < ఖర్చు), పూత్తిగ (పూర్తిగ);
పదాంతంలో... బామ్మర్ది (బావ + మరిది), నాత్తప్పయింది (నాది + తప్పయింది), అక్కల్లేదు (అక్కర + లేదు), తిర్పచ్చాపిత్తనన్నం (తిర్పతి + చూపిత్తనన్నం)

4. పదాంత సంధిలో సరళాదేశం :

మేం గల్సినం, పనిగావాలె, బి స్తరగట్కున్న, ఇల్లు గాపాడ్కనుండు; చిల్లరగ్జేస్కున్నాగాని, నాయన్జచ్చిండు, బుద్ధి జెప్పిచ్చుకునే తనంగాదు; నన్బిల్సిన్రు, కమ్మం బోయన్న, మందుల్బెట్టిందన్నె బీపి-, కొడ్కు బుట్టిండు; ఇండ్లదోల్న, దగ్గర్దియ, మా జావదీస్కచ్చి, కూరల్నార లెచ్చుకుంట-

(b) సోంపేట వ్యవహారంలో మాత్రమె కనిపించేవి :

అ కారం ఇ కారంగా మారటం :

డజిన్ (డజన్-ఆంగ్లపదం), పాతికి (పాతిక), భయ్యిం (భయం-ద్విత్వీకరణంతో), యజిమాని (యజమాని).

2. అ కారం ఉ కారంగా మారటం :

అప్పుడ్కి (అప్పడ్కి < అప్పటికి), ఒకుల్ (ఒకల్ < ఒకళ్ < ఒకళ్ళు). ఒక్కు (ఒక్క), మనుమ్రాలు, (మనమరాలు)

3. అ కారం ఎ/ఏ కారంగా మారటం :

అర్వెయ్ (అర్వయ్ < అరవయ్), డెబ్బెయ్ (డెబ్బయ్ < డెబ్భయ్) కెష్టం (కష్టం), గెంటలు (గంటలు), గెడ్డి (గడ్డి)

4. ఎ కారం ఇ కారంగా మారటం :

గొర్రి (గొర్రె), సీను (శేను), పన్నిండు (పన్నెండు)

5. న కారం ల కారంగా మారటం :

ఎనా (ఎలా ?), నేదు (లేదు), నోటాప్పాటు (లోటాప్పాటు < లోటుపాటు).

6. ప కారం మ కారంగా మారటం :

కన్మడ్తున్నవ్ (కన్పడుతున్నవ్ < కనపడుతున్నవ్)

7. ప కారం వ కారంగా మారటం :

ఎల్తవ్డు (ఎల్తప్డు < ఎల్లేతప్డు < వెళ్లేటప్పుడు), ఇవుడు (ఇవుడు < ఇప్పుడు)

8. మ కారం వ కారంగా మారటం :

పెన్విటి (పెన్విటి < పెన్మిటి < పెనిమిటి)

9. రేఫ ల కారంగా మారటం :

యొవుల్తో (యొవుర్తో < ఎవర్తో < ఎవరితో)

10. ల కారం న కారంగా మారటం :

పోట్లు పట్టాల్కి (పాట్లు పట్టాన్కి),

11. ల కారం రేఫగా మారటం :

తొల్యూర్ పాప (తొల్యూల్ పాప)

12. టడ కారం న కారంగా మారటం :

ఇవ్వానికి (ఇవ్వడానికి), కట్టుకోనానికి (కట్టుకోటానికి), కెష్టపడ్డానికి (కష్టపడ్డానికి)

13. ణ కారం ట కారంగా మారడం :

కుష్టుడు (కుష్ణుడు < కృష్ణుడు)

14. మూర్ధన్యతా లోపం :

ఎల్తప్డు (ఎల్టప్డు < వెళ్ళేటప్పుడు); ఎల్లిపోయ్తప్డు (వెళ్ళిపోయేటప్పుడు); అంతాను (అంటాను)

15. స్వరదీర్ఘీకరణం :

ఊప్కారం, (ఉపకారం), తాడ్డే (తవ్వేడే), పయ్యాద్ (పయ్యెద), ఏడ్డు (ఎవడు), ఈలాట్పని (ఇలాటిపని), కాల్కత్తా (కలకత్తా)

16. ద్విత్వీకరణం :

కడుపున్న (కడుపున), పద్దమూడు (పదమూడు), కల్పిన్నే (కల్పినే)

17. వర్ణ సమీకరణం :

(i) తిరోగామి-

అద్ద (అర్ద < అర్థ), ఖమ్మం (ఖర్మం)

(ii) పురోగామి

చేస్సున్నాన్ (చేస్తున్నాను), నీళ్ళేస్సున్నాన్ (నీళ్ళేస్తున్నాను).

18. అతి ప్రమాణీకరణం/అతినాగరికకరణం :

ప్రేమాండకం (ప్రమాణం), క్రిందట (కిందట), ఎత్త్రేళం (అత్యాళ)

19. వర్ణలోప వ్యత్యయాలు :

ఇర్తి (విర్తి < వ్రిత్తి < వృత్తి)

20. సంయుక్త వర్ణ సులభీకరణం :

ఇస్తిరి (ఇస్త్రీ), కోరిట్ల (కోర్ట్ల = కోర్టులో)

21. ల కారం బహువచన ప్రత్యయం ముందు వ కార లోపం :

వస్తులు (వస్తువులు), గాల్ల (గావల్ల < గావాల్లు)

22. పదాది ప కార లోపం :

ఎడ్తావ్ (పెడ్తావ్), ఓయిస్తాను (పోయిస్తాను)

23. శ్వాసం నాదంగా మారటం :

ఉదెకి, (ఉతికి), బొదుక్తాం (బొతుక్తాం < బతుక్తాం)

24. పదాంత సంధిలో యడాగమం :

ఆ యడ్డెడు (అ + అడ్డెడు), నా యమ్మకు (నా + అమ్మకు)

25. పదాదిన వర్ణాగమం :

ఇ. సూ్కలు (స్కూలు - ఆంగ్లపదం)

26. వ కారం య కారంగా మారటం :

అయి (అవి), పోయే! (పోవే!)

27. పరసంధిలో పూర్వ పదాంత దీర్ఘంపోయి పరపదా రంభవర్ణ ద్విత్వం కావటం (త్రికసంధి)

ఇ న్నల్గురికి ( ఈ + నల్గురికి)

## 2. పదనిర్మాణానికి సంబంధించినవి

1. భూతకాల ప్రత్యయం :

మహబూబాబాద్ వ్యవహార్త భాషలో భూతకాల ప్రత్యయాలుగా -ఇన-ఐన లు ఉత్తమ మధ్యమపురుషల్లోనూ, -ఇన్, న లు ప్రథమపురుషలోనూ వస్తాయి. ఉత్తమపురుషలో -తి ప్రత్యయం వాడిన సందర్భాలు ఒకటిరెండు కనిపిస్తున్నయ్. (ఉదా॥ తోడ్తి) అట్లాగే, ప్రథమపురుషలో -ఉండే (దీని తర వాత పురుష ప్రత్యయంరాదు) ప్రత్యయం వాడిన సందర్భాలుకూడాఉన్నయ్. ఈ రూపాలు గ్రాంధికరూపాలో మాండలికరూపాలో చెప్పటం కష్టం. (ఉదా: అవులేవుండె, ఆడాల్లు... అందరు దిగి తానం జేస్తాండె, ఒక దొరవుండె; నా పొలంవుండె). మరో ప్రత్యయంకూడా భూతకాల వాచకంగా వాడేడా వ్యవహార్త. (ఉదా : నాయన్జచ్చె; తాతజచ్చె).

సోంపేట వ్యవహార్త విషయంలో -ఇనా,-నా లు అత్యధికంగానూ, -ఏ అత్యల్పంగానూ అన్ని పురుషల్లోనూ కనపడతాయి. అయితే ప్రథమపురుష పుంలింగేతరాల్లో -ఇన్ ప్రత్యయం ఎక్కువగా వాడటం ఉంది.

| | మహబూబాబాద్ | | | సోంపేట | | |
|---|---|---|---|---|---|---|
| ఉ-ఏ- | -ఇన-<br>-న- | (ఁ) | చూసిన, వచ్చిన, చద విచ్చిన, ఇచ్చిన, చద్విన ఎల్నె, జేస్న, అన్న, అన్కున్న, ఉన్న, కట్కున్న | -ఇనా-<br>-న- | ను | పుట్నాను, ఎల్నాను, తాగినాను, ఎళ్ళొ యొచ్చినాను, ఎల్లాను |
| బ- | ,, | (మ్) | కల్సినం, పోయినం, వచ్చినం, చేస్నం ఉన్నం | ,, | (మ్) | చేసినా, తిరిగినాం |
| మ-ఏ- | ,, | (వు) | చాదినవ్, సవ్రిచ్చినవ్ | ,, | (వు) | చేసినావ్, పుట్టించ్నావ్, ఇచ్చినావ్ |
| బ- | — | | — | — | | — |
| ప్ర-ఏ-పుం- | -ఇన్-<br>-న- | (డు) | చెప్పిండు, చచ్చిండు, పంపిండు, కొట్లాడిండు, కొంచబోయిండు, అన్నడు, ఉన్నడు | | | పుట్టాడు |
| ఇతరం- | ,, | (ది) | ఒచ్చింది | -ఇన్-<br>-న- | ది) | ఇచ్చింది, చేసింది, అన్నాది అయిపోయింది, అయింది |
| బ-మ- | ,, | (రు) | పెట్టిను, ఇచ్చిను, ఒచ్చిను, అయ్యిను | ,, | (రు) | ఎళ్ళొయ్యారు, చేసేస్నారు |
| ఇతరం- | ,, | (య్) | ఉన్నయ్ | ,, | (యి) | ఉన్నాయి |

**2. తద్ధర్మార్థక ప్రత్యయాలు :**

అతి తరచుగా త, అతి అరుదుగా తా లు మహబూబాబాద్ వ్యవహర్త భాషలో తద్ధర్మార్థక ప్రత్యయాలుగా కనిపిస్తున్నయ్. అయితే ఒక్క ప్రథమ పురుష ఏకవచన పుంలింగేతరాల సందర్భంలో మాత్రం- తున్ ప్రత్యయంకూడా అప్పుడప్పుడు వాడటం ఉంది.

సోంపేట వ్యవహర్త భాషలో తా మాత్రమే అన్ని సందర్భాల్లోను వాడటం కనిపిస్తుంది. అంటే ప్రామాణిక భాషలలోలాగా కాకుండా ప్రథమ పురుష ఏకవచన పుంలింగేతరాలకు కూడా ఈ ప్రత్యయమే వాడుకలో ఉంది. అప్పుడప్పుడు హ్రస్వత్రకారంకూడా ఈ వ్యవహర్త వాడతాడు.

| | మహబూబాబాద్ | | సోంపేట | |
|---|---|---|---|---|
| ఉ-ఏ- | -తా/త- (ను) | పోతా, వస్తా, ఇస్తాన్, పెడ్త, ఇస్త, పోత, | -తా- -టా- } ను) | చేస్తాను, చెరుగ్తాన, కోడ్తాను, నమ్ముతాను, చేస్తాను, కూకుంటాను, పట్కుంటాను |
| బ- | -త- -ట- } (మ్) | ఇస్తం, పోయెస్తం, ఇప్పిత్తం, పెట్టుకుంటం | -తా-(య్) | బోదుక్తాం, చేస్తం |
| మ-ఏ- | — | — | -తా- (వు) | ఇస్తావు, ఎడ్తావ్ |
| బ- | — | — | — | — |
| ప్ర-ఏ- పుం- | -త- -ట- } (డు) | బతక్కడు, ఔతడు, తీసేత్తడు, చంపాయించ్కుంటడు | -తా- (డు) | బతుక్తాడు, జీవిస్తడు |
| ఇతరం- | -తుర్య/త- (ది) | అయ్యుంది, అయిద్ది (అయితది | -తా- (ది) | నిండ్తాది, ఏడుస్తాది, తెలుస్తాది, గిడ్తాది, ఎల్తాది. నొడుక్తాది |
| బ-మ- | — | — | — | — |
| ఇతరం- | — | — | -తా/త- (యి) | అస్తాయి, పుడ్తయ్ |

౭. శత్రర్థక ప్రత్యయం :

సోంపేట వ్యవహార భాషలో -తున్నా-, -తాన్న-, -తన్నా-, -తన్-, -తన్న- లు శత్రర్థక ప్రత్యయాలుగా ఉన్నయ్. అయితే, వీటిల్లో -తున్నా-, -తన్నా-ల వాడకం ఎక్కువగా ఉంది. -తన్- ప్రత్యయం ఒక్క ప్రథమ పురుష ఏక వచన పుంలింగేతర సందర్భాల్లోనే వస్తుంది.

మహబూబాబాద్ వ్యవహార భాషలో -తాన్న-, -తాన-, -తాన్- లు శత్రర్థక ప్రత్యయాలుగా ఉన్నయ్.

| | మహాబూబాబాద్ | | సోంపేట | |
|---|---|---|---|---|
| ఉ-ఏ- | -తాన్న- (φ) | గడుప్తాన్న | -తున్నా- (ను) | ఎలోప్రొయొస్తున్నాను; చేస్తున్నాను |
| | | | -తాన్న-φ | చెప్తాన్న |
| బ- | — | — | -తున్నా-<br>-తన్నా-<br>-తాన్న- (మ్) | తూంగుంటున్నాం,<br>చే స్తు న్నా ము,<br>భోంచేసేస్తాన్నం |
| మ-ఏ- | — | — | -తున్నా- (వు) | కన్మద్తున్నావ్ |
| బ- | — | — | — | — |
| ప్ర-ఏ-పుం- | -తాన- (డు) | చాదుకుంటానడు | -తన్నా- (డు) | ఇస్తన్నాడు |
| ఇతరం- | -తాన్-(ది) | అంటాంది | -తన్- (ది) | చేస్తంది |
| బ-మా- | -తాన్- (రు) | బత్తాండ్రు | -తన్న-<br>-తన్నా- (రు) | పోతన్నరు, పోతన్నారు, ఏడస్తన్నార్ |
| ఇతరం- | — | — | -తన్న- (యి) | ఒస్తన్నయ్ |

4. నిశ్చయార్థక ప్రత్యయం :

మహాబూబాబాద్‌లో -ఆలె, -ఆల ప్రత్యయాలుండగా; సోంపేటలో -ఆల్లి, -అల్లి, అల ప్రత్యయాలున్నాయి. ఉభయ ప్రాంతాల్లోనూ -ఆల అనేది వాడుకలో ఉందన్నమాట. కానీ, సోంపేటలో -ఆల్లి అధికంగా వాడుకలో ఉంది.

(మ) ఇయ్యాల్లె, రావాలె, చెయాలె.
చెప్పాల, చూపియ్యాల

(సోం) కెష్టపడాల్ల, మార్చికోవాల్ల, పట్టుకోవాల్ల, కట్టాల్ల,
కూకోవాల్ల, కావాల్ల
పుట్టించల్ల, ఇవ్వల్ల, కావల్ల,
ఉండాల, ఇవ్వాల, కావాల.

5. భావార్థక ప్రత్యయం :

మ. లో -అటం/అడం, -ఉడు, -ఏది అనే మూడూ భావార్థక ప్రత్యయాలుగా ఉంటే, సోం.లో -టము/డము మాత్రమే ఉంది. అంటే సోం.లో -అటం/అడంల అంత్య మకారానికి ఉ చేర్చి ము గా పలుకుతారన్నమాట.

(మ) ఏసొక్కటం, ఎత్తొక్కటం, బత్కడం
చేసుడు, సదురుడు
చేసేది, పెట్టేది

(సోం) జీవించటము, పన్చేయించడము, కోసొక్కడ్మూ, తోసొక్కడ్మూ
మోసొక్కడ్మూ, తీసొక్కడ్మూ.

సోం.లో ఆత్మనే ప్రత్యయంతో కూడిన క్రియా ప్రాతిపదికపైన చేరిన భావార్థక ప్రత్యయంలో ద్వితీయ హ్రస్వాచ్చులోపించడం గమనించదగ్గ విషయం.

6. ద్వితీయాదివిభక్త్యంగం :

నామ ప్రాతిపదిక చివర డు ఉంటే, దానికి కి ప్రత్యయం చేర్చినప్పుడు, మరొకపదంతో అది సమసించినప్పుడు సోంపేట భాషలో ఆ డ కారం మారదు కాని మ.లో అది తరచుగా న కారంగా మారుతుంది.

(మ) అల్లునిక్కి, వానిక్కి, దేవుని గుడి
దేవుడికి, అల్లుడిక్కి

(సోం) దేవుడిక్కి, ఆడిక్కి, మొగోడిక్కి

7. అనంతరార్థకం :

సోం.లో తర్వాత ఉపయోగంలో ఉండగా మ.లో ఏక, -ఆక/అంక అనేవి వాడుకలో ఉన్నయ్.

(మ) చచ్చేక,
అన్నాక,
తీస్కున్నంక, పోయ్నంక

(సోం) పుట్టి న్తర్వాత

8. (తద్ధర్మార్థక) క్రియాజన్య విశేషణం :

సోం.లో క్రియామూలంమీద -ఏ చేరుతుంది. మ.లో -ఏటి చేరుతుంది.

(మ) తిగ్గేటి-

(సోం) వచ్చే-

9. అప్యర్థకం :

-ఇన ప్రత్యయం సో.గోనూ; -ఇనా, -ఇనాగాని మ లోనూ క్రియల మీద చేరతాయి.

(మ) ఒచ్చినాగాని, చెప్పినాగాని, అన్నాగాని;
ఉన్నా, పోయినా.

(సోం) చేసిన, ప్రాదించిన (ప్రార్థించిన)

(a) మ. వ్యవహర్తలో మాత్రమే :-

1. సమయార్థకం :
-తల్కె ఉ : అవ్వుడల్కె.

2. శత్రర్థకం :
తెచ్చుకుంట, పణ్జేస్కుంట

3. అవు బదులుగా అయి :
అలావాటయిద్ది, అయ్తూంటది, అయుంది.

4. పూర్వవర్ణ దీర్ఘంపోయి పరవర్ణ ద్విత్వం రావటం :
లెవ్వు.

5. దగ్గిరికి బదులుగా కాడికి :
ఇంటికాడికి, గుడికాడికి

(b) సోం. వ్యవహర్తలో మాత్రమే :-

1. అప్పటినుంచి బదులుగా కాడ్నుంచి :
పల్నికాడ్నుంచి, పరాప్లైనైనాక్డ్నుంచి

2. -ఆనికి బదులుగా తద్ధర్మార్థకంమీద -అంటే చేరుతుంది,
తింటామంటే, కట్టుకుంటామంటే, కడ్తామంటే

3. భావార్థక రూపాలు ఒకొక్కప్పుడు అటం బదులుగా -అనం చేరటం వల్ల ఏర్పడతాయి.
కషపడ్డానికి, ఇవ్వానికి/ఇవ్డానికి, కట్టుకోనాకి

4. వ్యతిరేక నిశ్చయార్థకాల్లో అన్నంతరూపం మీద ఒద్దు చేరుతుంది.
చెప్పొద్దు (=చెప్పక్కర్లేదు)

5. బహువచన లోపం :

నాల్రూపాయ్, రొండ్రూపాయ్, పద్దకొండుమన్షి.

6. నిర్ధారణార్థక పంచమీ విభక్తి ప్రత్యయం :

నా కాడికి (=నాకంటె)

### 3. వాక్యనిర్మాణానికి సంబంధించినవి

సోం. వ్యవహర్తలో మాత్రమే :

1. 'ని' (ద్వితీయ) కు బదులుగా 'కి' (షష్ఠి) వాడటం :

మనుమ్రాల్కి తోక్కెల్తాను, అయ్యగుర్కి యొవ్వు పెల్లాడ్తాడు? దేవుడ్కి ప్రాదిస్తాన్నం, నాక్పిలిస్తావ్, నాకేరమ్మంది, రాజం తోడైకనా లచ్చపెట్నున్.

2. అంతాగమవర్ణ లోపం :

మేం ముగ్గు రుంటాం. (ముగ్గురు ← ముగ్గురం)

### 4. పదజాలానికి సంబంధించినవి

| (మ) | (సోం) |
|---|---|
| గది, గిది, మొ॥ | అది, ఇది, మొ॥ |
| పాలి | దఫా, చారి (=సారి), మాటు |
| నువ్వు | నీవు |
| ఆయాల | ఆపొద్దు |
| దన్నం | దండం |
| బర్రె | గేదె |
| బిడ్డ | కూతురు |
| ఏన్లు | సమచ్చరాలు |
| చాదు- | పెంచు- |
| కాపాడు- | కాచుకోన్- |

(a) మ. వ్యవహర్తలో మాత్రమే :

మంచిగ (బాగా), మంది (ప్రజలు), -కూడి (-కలిసి), రెక్క (చెయ్యి), అవుసు (అయుష్యం), తనం (వయస్సు), తప్పకుంట (తప్పకుండ).

అన్చెప్పి (అని), వూకో (ఊరుకో), అస్మంటి (అటువంటి), ముంగల (ముందు) ఇన్ల (ఇక్కడ), దాయబెట్టు- (దాచు-), కొంచబోవు- (తీసుకుపోవు-), చద్వెన (చదివించాను - చదివింపులు), చెల్క (మెట్ట భూమి), మేనోడు (**cross-cousin**), చుట్టు (మైల-సూతకం), పాజుట్టు (బూజు), మెదులు- (ప్రవర్తించు-).

ఇంగ్లీషు పదాలు : ఓటల్ (హోటల్), మీటింగు

సంస్కృతపదాలు : తానం (స్నానం), సవరం (క్షౌరం), బూమి (భూమి), ఇస్టం, పబుద్ధుడు, బయం, పాపం, దర;

ఉర్దూపదాలు : గాడీ (రైలు), జాగ (ఇళ్ళస్థలం), బిస్తర్, ఇత్వ (**surrendering document**), రకం (శిస్తు) పలానా గిరిన్ (మిల్లు), అమాన్‌పని (కూలిపని), పుకారు (ప్రచారం), రుమాల్, ఖర్చు, రోజు, మేస్త్రీ

(b) సోం. వ్యవహారంలో మాత్రమే :

లచ్చారం (లక్ష్మీవారం-గురువారం), ఓపిక (నమ్మకం), ఎల్తుంది (గిడుతుంది), ఎల్లిపోయొచ్చ్- (వచ్చు-), ఏటి? (ఏమిటి?), పెనివిటి (భర్త), చాకింటిరేవు (చాకిరేవు), యజమాని (భర్త), పడినకాడ (మెట్టినచోట), కాచుకుంటే (కాపాడుకుంటే), అందునుంచి (అందువల్ల/అందుచేత), పులివిన బట్ట (మాసిన బట్ట), నిజమంత్రాలు (సత్యవంతురాలు), తూంగున్- (పడుకొను/నిద్రపోవు-), కూకొన్- (కూర్చొన్-), ఆ పొద్దు (ఆ రోజు), దర్దాపుల (సుమారు), పరక (అర్ధణా), ఒప్పం (ఒప్పుకోం), మీకాడ్కి మాకాడ్కి (మీకూ మాకూ), బుర్ర (నెత్తి), తిరుక్కొని- (తిరిగి-), ఏటికి (ఎందుకు?) కయ్యం (పోట్లాట),

ఇంగ్లీషు పదాలు : ఆపరేసాలు (ఆపరేషన్లు), డజిన్, గ్లాసు, యాడ్య (ఐడియా), రేడ్య (రేడియో), సోరిట్ల, కేసు, టీ, టిక్కటి.

సంస్కృత పదాలు : కష్టం, సుకం, కర్మ. ప్రాదించిన, ఇర్తి (వృత్తి) జీవిస్తడు. బూమి (భూమి), దనం, యాపారం, ఎత్తేస్రం (అత్యాశ), సత్తెం, పేమాండకం (ప్రమాణం), అద్ద, బాగ్యవంతుడు, బలం, వస్త్రం, ఊపాకారం. గర్భాన, పటుత్వం యతం (ఆత్మ), రాజాన (రాజ్యంలో) ఆలకిస్తుంటారు, కాలం, దేసెం. పర్వాల్న, లచ్చారం (లక్ష్మీవారం), పుర్షుడు, అన్నం, బోంచేసే స్రాన్నం, లచ్చపెట్న, దినం, భయ్యం, బేమలోకం (బ్రహ్మలోకం). ఆగుర్మ (ఆహారము),

ఉర్దూ పదాలు : దఫా, నౌకరి (ఉద్యోగం), ఇస్తిరి (ఇస్త్రీ), ఆకర్కు, రోజు

## పరిశీలన సారాంశం

వ్యవహార్తలిద్దరిలోనూ ఉన్న ముఖ్యసామ్యాలు : శ ణ ష లు లేక పోవడం, పదాది హా, వ లలోపం, పదమధ్య ద్వితీయహ్రస్వాచ్చు లోపం, మహాప్రాణలోపం, -ల, -కాడ, -తోని మొదలైన విభక్తి ప్రత్యయాల వాడకం వి వారి 'శిష్టేతరత్వా'న్ని సూచిస్తయ్.

ఇక, వాళ్ళభాషల్లో కనపడే తేడాలు వాళ్ళున్న ప్రాంతాల కారణంగా మాత్రమే ఏర్పడినవని చెప్పొచ్చు. అవి :

1. మహబూబాబాద్ వ్యవహార్తలో పదాంత సంధి కారణంగా సరళాదేశం జరగడం ఒక ప్రత్యేకత.

   సోంపేట వ్యవహార్తలో ల కారం గ కారంగా మారటమూ, స్వరదీర్ఘీకరణమూ, పదాంత సంధిలో యడాగమం జరగటమూ (అత్వసంధి) విశేషం.

2. క్రియారూపాల్లో, అందునా ప్రత్యేకంగా భూతకాలిక క్రియల్లో, వారి మధ్య తేడా స్పష్టంగా కనపడుతుంది. అన్ని క్రియల్లోనూ ఉత్తమ పురుష ఏకవచనంలో పురుషప్రత్యయం అయిన ను ఉంచిన రూపాలు సోంపేటలోనూ, వదిలేసిన రూపాలు మహబూబాబాద్‌లోనూ వాడుకల్లో ఉన్నయ్.

   ప్రథమ పురుష ఏకవచనంలో పుంలింగేతర ప్రత్యయంగా సోంపేటలో దు మాత్రమే ఉంది. మహబూబాబాద్‌లో దు తో పాటు ది కూడా ప్రత్యామ్నాయంగా ఉంది

3. ద్వితీయాది విభక్త్యంగంగా సోంపేటలో ట ఉండగా మహబూబాబాద్‌లో అది న గా మారుతుంది.

4. వాక్య నిర్మితిలో ద్వితీయావిభక్తి ప్రత్యయానికి బదులుగా షష్ఠీ విభక్తి ప్రత్యయం వాడటం సోంపేట వ్యవహారంలోనే ఉంది.

5. సోంపేటలో ఇంగ్లీషు పదాలు ఎక్కువగా వినబడతాయ్, మహబూబాబాద్‌లో ఉర్దూపదాలు ఎక్కువ.

6. సంస్కృతతత్సమ శబ్దాలు సోంపేటభాషలో వచ్చినన్ని మహబూబాబాద్‌లో రాలేదు.

# 6
# మాండలిక పదాలు పదబంధాలు

| | |
|---|---|
| అడ్డ | లైటు చిమ్నీ |
| అలపొద్దు | సాయంత్రం |
| ఏవలేయు | దాహం వేయడం |
| కంప | కొబ్బెర చీపురు |
| కత్తు కలుపు | స్నేహం చేయడం |
| కన్నుగీరు | కంటికురుపు |
| కమాను | కెంపు |
| కర్త | కారణం |
| కిరిది | చిల్లర |
| కునికెయ్యడం | చచ్చిపోవడం |
| కొర్నుంచు | కొర్ను మేపడం |
| కొర్నొగ్గేయు | సాగుచేయకుండా భూమి వదిలేయడం |
| కోనారి | యాదవ స్త్రీ |
| కోలు పీపా అవు | ఉబ్బితబ్బిబ్బు కావడం |
| గండికవు | ఆందోళన పడిపోవడం |
| గండికచేయు | 1. అల్లరిచేయడం,<br>2. ఉత్సవం/సంబరం చేయడం |
| గల్లా | కిరోసిన్ పంప్ |
| గాయకం | ప్రియం |
| గిలక్కి నీసు దిగడం | బుర్ర తిరగడం, |
| గుండ | పొడి |
| గుండాం | హడావుడి ఉదా: ఎందుకలా గుండాం పడిపోతావ్ |
| గుత్తులు | పాదాలు |
| గేటు కాపేయు | గేటు దగ్గర కాపలా ఉండటం |
| గొల్లు | అల్లరి |
| గోలి | సందు |
| టోపీ అల్లు | మోసం చేయడం |

| | |
|---|---|
| డవులు | రంగు |
| తండాగా | తృప్తిగా |
| తాటాతూట | ఏదో సర్దుబాటు |
| తీపి దిగెయ్యి | నష్టం కలగడం |
| తుడుచు | ఊడ్వడం |
| తూకం | తక్కెడ |
| తెండు | తోడడం |
| దిబ్బడాలు | పచ్చిగా ఉన్నవి. |
| దిలాసా | నిబ్బరం, ధైర్యం |
| దీవి | చూడాలనే కోరిక |
| దుక్కి | వర్షం |
| దుక్కి పూయు | బండికి ఎడ్లు కట్టడం |
| నఫిరి | వెకిలి పనులు చేసేవాడు |
| నాగులు | చెవులకు పెట్టుకునే ఆభరణం |
| నిఘా వేసుకూర్చును | ఊరికే కూర్చుని పనులు ఎగెయ్యడం |
| నిట్ట మోయు | బాధ్యత తెలియడం |
| నీరు తెండేయు | నీరు తోడడం |
| నీరు పూను | నీరు నిలవడం |
| పగిడీ | (తల) పాగ |
| ప్రమాండకం చెయ్యి | ప్రమాణం చెయ్యడం |
| పల్ కర్ర చేయు | పళ్లు తోముకోవడం |
| పల్ దోమ్ పుల్లచేయు | ,, |
| పలుకుబడి చేయు | మాట్లాడడం |
| పల్లకోను | ఊరుకోడం |
| పాలు తిరిగేయు | పాలు పారబోయడం |
| పికరు లేకుండా పోవు | అయిపులేకుండా పోవడం |
| పిక్కలాగా ఉండు | పుష్టిగా ఉండడం |
| పిలక తిరుగు | బుర్ర తిరగడం |
| పిల్లి కూనలు | రూపాయలు |
| పొడగట్టడం | తోచడం |
| పొర్లు | దాటడం |
| బండి పూయు | బండికి ఎడ్లు కట్టడం |

| | |
|---|---|
| చింద వెయ్యి | తనఖా పెట్టడం |
| బద్దు | తీగె |
| బారుగా అవుపడు | చాలా బాగున్నట్టు కనబడ్డం |
| బరువసా | ఆసరా |
| బవిష్యం | గౌరవం |
| బుక్కుల్ పోవు | భయపడడం |
| బులావులు | మంచిమాటలు చెప్పి పనులు చేయించుకోడం |
| బొమ్మల్లా పడడం | బోర్లా పడడం |
| బోజీ | విందు భోజనం |
| మండిక /మండిగె | మట్టిచిప్ప |
| మడక | ప్రాంతం, ప్రదేశం |
| మాట మిగలడం | నోటికొచ్చినట్టు మాట్లాడడం |
| ముడుకు/ముడుసు | మోకాలు |
| ములికి | ముల్లు |
| మెకం | సవరం |
| యాతం | మనసు |
| రెంటాం | మూపురం |
| రేక | చేద |
| లయలు వెయ్యి | చూ : బులావులు |
| లాంతరు వెయ్యి | పేకాటలో పనికొచ్చిన ముక్కలు వెయ్యడం |
| వండ | పెద్ద సొరంగం |
| వరకట్టు | బాగుచేసి హక్కు ఏర్పరచుకోడం |
| వలం | లావు |
| వలవేసి చూడడం | ఆలోచించి చూడడం |
| వీగిపోవు | ఓడిపోవు |
| షలాగ్గా | సన్నగా |
| సత్యం చేయు | ప్రమాణం చేయడం |
| సదావృత్తి | తిండి |
| సరకత్తు | ఊరేగింపు |
| సాలు (<చాలు) పోయు | నాగలితో దున్నడం |
| సార్లా | పూర్తిగా |
| సొమ్ములు పూయు | బండికి ఎడ్లు కట్టడం |

# సాహిత్యంలో ప్రయోగాలు

ఇలాయి బుడ్డీ = ఒక కర్రకు తగిలించు దీపం బుడ్డి

"తగ సూర్య ప్రచలాయి లాయులును జంద్రజ్యోతులున్"

హంసవింశతి 3 ఆ.

ఒర్ర (గుండ) = కారం

"ఒక కొన్ని ద్రబ్బెడలొక కొన్ని తాలిపులొక
కొన్ని విధముల యొట్టి చేరులు"

పాండు, ౪, ఆ.

కూన = పిల్ల

"కూనలఁగానలకుఁబనుపు కొననేరుతునే"

అచ్చతెనుగు రామాయణం, బాలకాం.

కోక = చీర

"కోకయునాననంబు గొడుగున్
శయనాదులుఁ దానయైజయో
త్సేకముతోడ నాగకుల శేఖరుఁడున్
ధ్వజవాహనాదికా, స్తోకవపుర్వి శేషములతో
గరుడుండుఁబురంబు సర్వమున్, దాకొని
కాచుచున్నకుముద ప్రముఖుల్ సతతంబుఁ గొల్వగన్"

పరమయోగి విలాసము ౧, ఆ.

గుత్తి = చీలమండ

"గుత్తులకొలఁది కిఁగృత్తంబులై పడియున్న పాదంబు
నొక్కొక్కచోట"

నిర్వచనోత్తర రామాయణము. ౪, ఆ.

తాపితా = పట్టుబట్ట.

"పచ్చతాపిత దట్టిఁబసమించు పచ్చరా చిలుకక్రొంచిడి
వంకియల వరించు"

చంద్రాంగద చరిత్రము ౨ ఆ

దగ దాహం, దప్పిక

"పెనుదప్పు దగ దొట్టఁ జని రెట్టవడఁ గొట్టెనుడు వీధి బెళుగువ్వ నొక్కయణుజు"

స్వారోచిషమను సంభవము ४, ఆ

దావకర్ర = నిచ్చెన, తాప

"కపిలు నింగలపుఁజూపు సెకలంగలయు నాసగరు వంగడము మోతోత్తుంగ మణిసౌధమునకున్ గడపుఁదాప"

పారిజాతాపహరణము, ౨. ఆ

దాపల = ఎడమ, డాపల

"కటకటకాశికాపురి నొకనొక సిద్ధురఁ గను మోడ్చియ, ప్పటికను విచ్చుసడ్డు కుడిభాగముఁ గన్గొని చోద్యమందుదా, పటిదెసఁ జూచియచ్చెరువు పాటు వహించు మనస్సరోజసం, పుటమున నాఁడులాగు

మణిపోఁడిమియుఁగల జంతుసంతతుల్"

కాశీఖండము 3. ఆ.

నాంగలి = నాగలి

"స్కంధ పీఠంబు మీఁద నాఁగలి దగిల్చి"

హరివంశం, ఉ. ౧ ఆ.

నిగుడు = గర్వపడడం

"తోలూడ్చు మహానాగంబునుంబోలెఁ గరవాలంబు తాన యొఱవెలికి నిగుడుచున్నయది"

భారతము, ఉద్యోగపర్వము ౨

నెమకు = వెతుకు

"తనమణి పడిపోవ ధరణితలంబున నెమకంగ వచ్చిన నింగి యనఁగ"

పారిజాతాపహరణము, ४.

బైసి = పరువు, సిగ్గు

"చేసి యిటులేలకలమ్ముల బైసిగొనియె"

చంద్రాంగద చరిత్ర, ౨.

బొట్టెడు = పిల్లవాడు

"ఎట్టి మొనగాం(డురేనియు, గట్టిగ నా యెదుట
దిటముగనగ పఱతురొ, నెట్టుకొని నేఁడు
మిగులఁ, బొట్టెఁడ నీ వెట్లు
నిలిచి పోరెదు చెపుమా"

అచ్చతెనుగు రామాయణం, బాలకాండ.

మట్టు = తొక్కు

"కొడుకుల పాటు సూచి కడుఁ గోపమెలర్పఁగఁ
దల్లులొక్కయు, మ్మడివన జాయతేఱుని
మట్టఁ దలంచి"

హరివంశము, పూర్వభాగము ౬

మిత్తు = స్నేహితుఁడు

"అత్తెఱఁగున సైదోడని, నత్తమిలినఁజూచి
రాముఁడలుకనిగుడఁగా, నత్తోలు వేలుపుఁగలువల,
మిత్తఁ డాకొని కడంక మీఱంబలికెఁ"

అచ్చతెనుగు రామాయణం, యుద్ధకాండ

మొగచాటు = మొగము కొట్టునది, వెగటు

"పదునాల్గు మహాయుగముల, ముదుకకు భీమేశ్వరునకు
మొగచాటైయుం డదు సాని పెండ్లి యెప్పుడు
నది దాక్షారామమహిమమవునోకాదో"

భీమేశ్వరపురాణము, ౧, ౮.

మొదవు = ఆవు

అడిగినఁగొద్దుక పుడమి వేల్పులకు
నిచ్చలుఁ బాఁడి మొదవులఁజాల నొసఁగు

నీలాసుందరీ పరిణయము ౧, ౪౯.

సొమ్ము = గోధనము

దొడ్డి పట్టులగొప్ప దొరసానుల యొదళ్ళ
సొమ్ములు సొమ్ములు సొంపు నెఱప

అచ్చతెనుగు రామాయణం, బాలకాండ.

# అనుబంధం - 1

## వ్యవహార ఖండిక : 1

వృత్తి : పాల అమ్మకం　　　కులం : యాదవ
వయసు : 50 సం॥　　　స్థలం : సోంపేట
విద్య : నిరక్షరాస్యురాలు

(నీకు చదువొచ్చా?)

నేదు. చదువొస్తే దేసెమ్ తిరిగేసీస్ను.

(ఎందుకు చదువుకోలేదు ?)

పెద్లాడ్ కాడనుంచి చదుక్ లేదు. మాది రయ్‌తాగమ్ పని. గెడ్డి కోస్కోడము, పార పట్టి తొవ్‌కోడము, లేక్‌పోతే నీల్ మోస్కోడము, కర్రల్ తీస్ కోయ్‌డము- ఇలాటి పని.

(మీకేమున్నాయ్ ?)

గొర్ల్ లేవు. గేదెలున్నయ్. ఎడ్లున్నయ్. (అవి) ఎవ్‌సాయంకి వాడ్తాం. భూమేటి లేదమ్మ. కెష్టపడ్తే తిండి లేకపోతే ఉండొం.ఎంత చేసినా నవ్‌గిరే(నౌకరే)

(నువ్వు ఎప్పుడైనా యాత్రలకెళ్ళావా?)

సిమ్మాచెలం ఎల్నా. తొలిబ్బార్ పాప్‌కెతోక్కేన్ ఎల్నాను. మల్ రొండు సమ్మచాల్‌పోతె ఒక్ పిల్లడ్‌కెత్తుకోన్ ఎల్నాను, మల్ల ఎల్లాను. మల్లో మనుమ్మాల్ కెతోక్కేన్ ఎల్తాను. ఎల్తానన్ ఒప్కున్నాది.

(సింహాచలమే ఎందుకెళతావు ఇంకెక్కడకూ వెళ్ళవు ?)

మరంత డబ్బు లేదు. దేవుడివ్వలేదు. మర్ పుట్నాను కెష్టమే. మరి సుకబొడింది లేదు. పద్దకొండు మణిపి తర్వాత పుట్నాను. నాయమ్మకు పన్నెండు మణిపి పిలలు. చిన్నదాన్ని నేనే. నాకెప్పుడూ కెష్టమే. పయ్‌వోల్లంద్రూ (ఎనకన్నా పెద్దవాళ్ళు) నవ్‌కుర్లుక్ ఎల్‌పోయ్ ఒర్రిబొత్క ఆల్లు; అంజుమానము (అండమాన్) ఎల్‌పోయ్‌నారు ఒకిద్దరు, మరి కాల్‌కత్తెల్ పోయ్‌నారు ఒకద్దరు. అమ్మానాయ్నకి బూమి లేదు, పెల్లాడ్డ పెన్మిటిక్క బూమి లేదు మా కర్మది. దెవుడిక్క ఎంత ప్రేదెంచ్నా మాకివ్వడు. మర్ దేవుడ్‌కాడ నేనేం దోయిం (ద్రోంహాం) చేసినామో! మాకు దేవుడివ్వడు. కొట్లాడ్తే కొడుప్ నిండ్తాది, లేక్‌పోతే లేదు.

---

గమనిక : బ్రాకెట్లలో ఇచ్చిన భాగం ఇంటర్వ్యూ చేసినవారు వేసిన ప్రశ్నలు. ఆ భాగం శ్రీకాకుళం మాండలికం కాదు.

(అయితే నువ్వు కొట్లాడ్తావా ?)

మర్ కొట్లాడ్తనను. నాల్‌రూపాయిల్ పోల్ తెస్తాను. అందులో రొండు నీల్ తెస్తను, ఒటోక్కనోస్తను. అమ్‌కోని రొండడ్ల బియ్యం దొర్కితే పుచ్‌కోనెల్తను. మరి కొట్లాడం కాదిది? కూకుంటే నాక్ నాల్‌రూపాయిల్ అస్తాయా?

(ఎన్ని పాలకి ఎన్ని నీళ్ళు కలుపుతావు ?)

సోలెడు పోలయ్‌తె పాతికి నీళ్ళోయ్‌స్తాను. మర్ నా ఇత్తదే (వృత్తి) నా గొల్లిత్తి అదే.

(ఇత్తరంటే ఏమిటి ?

గొల్లాడు పిల్లడు కదు కుష్టుడు? ఆ కుష్టుడు మాయింటో పుట్టాడు కదు? మరాడు నీల్లు పోలు (పాలు) అమ్ముకునే జీవిస్తడు. ఉదు గొర్రి మైక అవు గేదె తోనే బతుక్తాడు. ఆడికి బూమిలేదు, దనము లేదు. కొట్లాడుకోని బతిక్తాడు. మా గొల్లోల్లు ఎన్ని నీల్లు కల్పిన్నే నీల్లని అంటేమే మొప్పము. ఒప్పము. మాయిత్తి గొల్లత్తి ఏటంటే అన్ని పోలూ అన్నినీల్లూ అమ్ముకోనే జీవించటము. అంటే యాపారము

(నువ్వు నీళ్ళు కలిపావని ఒప్పుకుంటావా?)

ఒప్పుకోను. సత్తెమంటే సేయ్‌ము. సచ్చెం చేయ్‌మంతారు "నీన్ నీల్ కల్పలేద"ని. పేమాండకం మేమ్ సెయ్యేం.

(ఎందుకు చెయ్యవ్ ?)

మర్ నేన్ చేసున్నాన్ కదా! నీల్లేసున్నాన్ కదా! పేమాండకం ఎనా చేస్తమ్. మరిన్నన్ని పసున్నానా? నీల్లెయ్ కంట మంచివ్ తెచ్చి మంచి కరీదు నువిస్తావా? ఇవ్వవివ్వవ్.

మాకు సోలెడు పోలు (పాలు) రొండురూపాయ్‌లు సోలెడు పోలు మీరవ్‌రూపాయ్‌కడుగ్‌తారు కదా. మాకెక్కడ్ కెల్తాదండి,

(నువ్వు మంచి చిక్కని పాలు పోస్తే నువ్వడిగిన ధరే ఇస్తారు కదా !)

అలంగివ్వొరు. పొద్దుకల్ల రయ్‌తువ్ నీవు. కెష్టపడ్‌నానిక్క నీనోస్తాను. నా యొల్లల్ల ఒంగుతాది. నా (<నాకు) చెమ్‌టెక్తాది. నీనెంతో కెష్టపడి ఉదుస్తాను. నాల్‌రూపాల్లు కూలివ్‌మన్ నీనంతాను - ఏది నాపిల్లల్కి సాల్దూ నాక్ సాల్దూ. కెష్టపడిన కూల్‌చాల్‌దాయ్ (కూలిచాలదయ్యా) అంటే పొద్దుకల్ల ఏం పన్ చేసినావ్ పోయే "అని రొండ్‌రూపాయ్‌లు నువ్ చేతెడ్తావ్ నీ మాట మీద ఎల్ పోయొచ్చినాము, నీకాడికి. నీకాడ పొద్దుకల్లి చేసినాము. ఇల్ బయల్దేరెల్‌తవ్వు రొండ్‌రూపాయ్‌ల్ నీవిస్తే నీన్ నాలడూతాను. (అడుగుతాను)

రొండిస్తావు. ఆ రొండుతోనే నేనెల్ పోయొస్తన్నాను. నాకెష్టము ఎప్పుడిచ్చినావు నీవు? ఉదెయ్‌మే ఎన్మిద్ గెంట్లకెల్‌తాము, సాయింత్రం అయ్‌ద్ గెంట్ల

కొస్తాము. అప్పుడ్ నాల్‌రూపాయ్‌ల్ కూలివ్వాల్ గదా? నాల్‌రూపాయ్ కూల్‌దాన్కి రొండురూపాయిస్తావు.

ఇంద్రాగాందమ్మ బూమ్‌లివ్వాలన్నాది, ఈ కొలొం (క్వొలొం) కాదన్నాది ఆ కొలొం (క్వొలొం) కాదన్నాది, అంద్రూ ఒక్టే క్వొలొం అన్నాది. మన ఆడోల్లు చాన పెఱయ్ పోయ్‌నారు, మొగోరు తక్కువన్నాది. ఆడోల్లకు మొగోల్లకు కొన్ని ఆపరేసాలు చేసింది. ఇప్పుడ్ కున్నే (ఇప్పుడు కూడాను) ఆడోల్లే ఎక్వయ్ పోతున్నారు. ఆల్లు మొగోల్లేతక్వయ్ పోతన్నారు. అల్ల(ఆడోల్ల) పుల్కే ఎక్వ. ఒక్క మొగోడ్కి అయ్‌గురు ఆడోల్లు, లెక్క చూస్తె. మరయ్‌గురిక్కి ఒవ్వు పెళ్ళాడ్తాడు? ఒవ్వు చేస్తాడు? ఒక దాంతోనె పోట్లు (పాట్లు) పట్టాంకి ఆడ్కి బలం చాల్దు. ఆ ఒక దాంతోలే పోట్లుపడేటాల్కి సరి, మరి అయ్‌దుగురిక్కి ఎక్కడ పెంచగల్దు? ఇద్దర్‌పిల్లల్‌తోని ఎందుకు ఆపరేషన్ చేస్తంది? ఆడ్కి బల్మొండాల మరొక్కూకల్ తెచ్చుకోవల్ల, కెష్టపడాల్ల. నీకుటుంబాన్కి ఈ ఇద్దర్ పిల్లల్‌తోని చాలు. కెష్టపడినోడు కడుపున నల్‌గురు పుత్తే మర్ నాలుగెకరాలన్నా ఇవ్వాల. నాల్గు పోవ్‌లయ్‌నా ఇవ్వాల. మరుసూర్ మన్‌తోలేస్తె "పుట్టించ్‌నావ్ దేవ్‌డా! నాకెందుక్ పుట్టించల్ల, తింతానంటె కూడ్ లేదు, కట్టుకుంతానంటే వస్త్రం లేదు. మా తల్లయ్‌న కడ్పున ఎందుకు పుట్టేను అని ఎంతేడుస్తాది? డబ్బూ దనము ఉన్నోల్లకి నోట్‌పాట్ లేదు (లోటు పాటు) లేనోల్లు పై దాయం పడి ఎందరో ఏడస్తున్నార్. అన్నం తింతామంటే లేనోల్లు కొందరు, వస్త్రం కడ్తామంటే లేనోల్లు కొంద్రు.

నా ఎజ్మాన్కి పద్దమూడు సమచ్చరాలయింది పద్దమూడు రూపాయ్‌లు తీర్మానం. నాకొక్ పిల్లడు గర్భాన అయ్‌ను మాసాలు అయ్యున్నాడు. ఆపరేషన్ చేసేస్‌నారు. లేక్‌పోతె నాకొక డజన్నర పుట్టుందురు. ఎక్కడ తెచ్చి పెంచుదును. బూమ్‌లేదు. ఇవుడు (ఇప్పుడు) ముగ్గురాడోల్లకి మూడి చీర్లి ఇవ్‌నాన్కి లేదు. మూడు కంచాల్ ఇవ్‌నాన్కి లేదు. మూడు సెంబులివ్‌నాన్కి లేదు. మూడు గలాసులివ్‌డాన్కి లేదు. మరి ముగ్గుర్ బయ్‌ల్దేరెల్లినవుడు ఆల్లకి మూడే వొస్తూలిస్తంటె తొమ్‌దొస్తూల్ కావాల్ గదా? మరదీ లేదు. మర్ నల్‌గురు పుట్టిపోయుంటె ఎక్కడ తేచ్చిస్తాన్? బూమి లేదు, దేవుడివ్వలేదు. కెష్టపడి బొదుక్మన్నాడు. కెష్టమయ్‌చేస్తే ఒవ్వు కూలి సరింగివ్వోడు. మరెలాంగ (మరి ఎలాగ) బొదుక్‌తామ్ సెప్పు.

(మరి ఐదుగురిదాకా ఎందుకాగావు ?)

అప్పుడు సెప్పలేదు. చెప్పుంటే ఒక్కపిల్లతోనె నే నయ్‌పోయుందును. దేవుడా! మరినాకు ఇప్పుడ్కి ఇంతే గతి. నాక్ చూస్తే పుట్టిన్‌కాడా లేదు పడిన్‌కాడా లేదు. ఇన్నలుగురిక్కి కాచ్‌కుంటే ఆల్కి ఎలాంగ పెంచడం? నాకెక్కడ ఏట్ దొరుక్‌తాది అన్నిను (అని నేను) మానేక్‌పోయ్‌నా. మర

ప్పుడిక్క పొబుత్తం పుట్ లేదు. అందునుంచి పుట్టి పోయ్ నారు. పుట్టిన్ తర్వాత ఈ ఆయ్డ ఒచ్చింది. ఈ ఆయ్డ ఒచ్చి ఓవుల్ పని ఆల్ చేస్ కున్నారు.

(నీ కివన్నీ ఎవరు చెప్తారు ?)

నా (నాకు) ఓవుళ్ చెపొద్దు. నా యాతంలో పుడ్తాయ్.

(నీకు ఇందిరమ్మ చెప్పిన మాటలు అవి ఎవరు చెప్తారు? )

మనిందర్ గాందమ్మ పొబుత్వాం ఏల్న కాడనుంచి మన ఆంద్ర రాజ్యాన అనుకున్ మాట్లనే సేన్ చేవ్ తాన్న. రేడ్యా ఆవ్ దప్పు ఇంతంతాను, ఒవుళయ్న ఒదల్ తుంతె ఆలకిస్తుంతాను. మరిలాటి మాట్లొస్తన్నయ్ కదా! ఊడయ్న (ఉప్పుడైనా) కాలం కమ్మంగ ఎల్తది గాల్ల, కట్టుకోనాల్ని బట్ట దొరుక్ తాది గాల్ల, మాకు కూలి గిడ్తాదిగావల్ల అని.

(నువ్వు లక్ష్మివారం పూజ ఎందుకు చేయలేదు ?)

మరేట్ లేవు. లచ్చారం పూజకి పొండు కావల్ల, కాయకావల్ల, పువ్వుల్ కావల్ల, పాల్ కావల్ల, పెరిగ్ కావల్ల.

(పాలూ పెరుగు మీ ఇంట్లో ఉన్నాయి కదా ?)

ఉన్నాది. మర్ దాన్కి అన్నం కావల్ల, అన్నిరకాల్ కావల్ల, నీనింటికాడుండాల్ల. నా బట్ట మార్చికోవాల్ల. ఇస్త్రీ బట్టోటి కట్టుకోవాల్ల. పులిమిన బట్ట కట్టుకోని ఏంపూచ్చేస్తాం. దెవుడస్తాడా మనింటికి? రాడు ఏట్లో ఉద్ కేసి కట్ కుంచే మరది సర్దెల్లండి. మనము చాకింటి రేవేపి పెల్లెట్టి, దాస, ఆ బట్ట తీసి కట్ కోని "దేవుడా!" అన్ దండం పెట్టి అక్కడ కూకోవాల. కూకుంచే దేవుడు. మరి బుర్ర మీద గంపెట్ కోని సోలెడు పోలు సోలెడు నీల్లేస్ కోని పదూర్లు తిరుక్కొనొస్తె నాకు కడువ్ నిండక్ పోతే మరివుడు (మరిప్పుడు) కూకోన్ దేవుడ్కి దండం పెడ్తె దేవుడివ్వక్ పోయింది. మరి ఎనమస్తదండి (ఎగొస్తదండి) చెప్పు? దేవుడిచ్చినట్టుగుంతె కూకుంతాను.

వొచ్చే జెన్మాన్కి నీన్ మల్లి పుడ్తానో పుటోన్, కొడుక్ కొడుపొల్ పుడ్తానో కూతుర్ కొడ్ పొల్ (కడుపులో) పుడ్తానో జెర్రయ్ పుట్టిపోతానో, నీన్ ఒవుళ్ కొడుపులో పుడ్తానో నాకేట్ తెలుస్తాదండి. ఉప్పుడిక్క అనుకుంతాను నీనే నిజమంత్రాల్ను ఒక్క పుర్షుడ్ తో నేడున్నాను. అని నీ ననుకుంతున్న. ఎందరో దాన్కి ఏట్ చెప్పగల్మ. డబ్బుకే జాతిలేదు.

# వ్యవహారఖండిక : 2

వృత్తి : న్యాయవాది
వయసు : 27 సం॥
విద్య : B.A LLB.

కులం : వెలమ
స్థలం : శ్రీకాకుళం

మార్నింగ్ లేచామా అంటే సీనెర్ (సీనియర్) ఆఫీసెక్కెల్లాలి. అక్కడ నుండి ఒచ్చి టెనోక్లాక్కి తిరిగొచ్చేసి బోంచేసి మళ్ళీ కోర్టుకు వెళ్ళాలి. ఈవ్నింగ్ వీలుంటే మళ్ళీ ఆఫీస్కి వెళ్ళాలి. అక్కడికి రోజూ వెళ్ళాలి. సీన్యెర్ ఆఫీస్‌లో ఫయల్స్ అవి ఉంటాయ్ గదా! తీసొక్కడానిక్కి అన్మాట. ఆస్ జూనియర్స్ మాకు తక్కువ్ ఉంటాయ్ గదా! ఫయ్‌లింగు! అందక్కని సీనెర్ కేసెస్ అన్ని సేమ్ చేకవ్ చేస్తామ్, అన్మాట.

(అంటే సీనియర్స్ మీకేమన్నా ఇస్తారా?)

అహాఁ (అఁహాఁ) సీనెర్స్ ఇవ్వడమ్ అంటూ ఉండదు. ఎందుకంటే ఒకొక్కాఫీస్కి ఇద్దరు ముగ్గురున్నారు జూనియర్స్. ఒక్కే జూనియర్ అయ్‌తే వాళ్ళకేద్ చేసినా బావుంటుంది. కానీ ముగ్గురు నలుగురమ్ అంటే ఒచ్చిన ఇన్కమ్ అంతా ఆ జూనియర్స్‌కే సర్దేయాల్సొస్తది. అందుకని ఏమంటూ ఉండదు. కానీ ఏదన్నా కేసు నరసన్నపేట, టెక్కలి గానీ చీపురుపల్లిగానీ ఇలా ఎక్కడయ్‌నా అక్కడ కేసుంటే ఆవూరెల్తే అప్పుడొచ్చిన కలెక్షన్ మాత్రమ్ మాకిచ్చేస్తారు.

సొసియ్‌టీలో బానే (బాగానే) ఉంది. మా ఫ్రెండ్స్ అందరూ అంటారు. "ఊర్లో అంతా ఎవ్వరూ లేరు. అమ్మప్రుతుంలాగా అయ్‌పోయావ్, ఈ ఊర్లో ఇంకో ఇద్దరు ముగ్గురు లేడీ ఏడ్వకేట్స్ వొస్తే ఆటోమేటిగ్గా తగ్గిపోతుంది''. అంటే నేన్ చెప్పేన్ అన్మాట ఏదయ్‌నా మా సీనియర్ని పెరూతుంది. అసలు మాకు స్టేటస్ అవి ఎక్కువయ్‌పోయ్ అసల్ ఈ మీటింగ్స్ వంటి ఇగ మాట్లాడ్డానిగ్గూడా టయ్‌ముండదు. అని తిరిగి జోక్ చేస్తుంటున్నాట.

మా క్లాస్లో చాలామంది చదివేరు. ఒక పదకొండు మంది చదివేరు కానీ అంద్లో ప్రేక్టిస్ చేయడమ్ ముగ్గురే అన్మాట.

(ఎందుకని చాలామంది Law చదువుతారు?)

కొంతమంది ఇంకే M.A. లో గాని Msc. లో గాని సీట్ రాకపోతే లా లో (Law లో) జాయినవుతారు. ఎక్స్‌ట్రా క్వాలిఫ్‌కేషన్‌గా ఒటి తీస్కుంటారు చాలామంది. నైట్ కాలేజ్ ఫెస్లిటీ ఉంది గాబట్టి జాబ్ చేసే వాళ్లు కూడా చాలామంది చదువ్‌తావుంటారు. ప్రొమోషన్స్‌కి వాటిక్కి

అన్నాట ప్రయార్టీస్‌కి. కొంతమంది ఇంట్రస్ట్‌తో జాయినవ్‌తారు. ఎక్కువ్ మంది మాత్రం పేరెంట్స్ అంటే ఫాదర్ ఏడ్వకేట్ అయ్‌తే సన్స్ జాయినవ్‌తారు.

(మీరేం చేస్తారు కంటిన్యూ చేస్తారా ప్రేక్టిస్ ?)

ఉహూ(ఉఁహూఁ) మానీయ్‌డం అంటూ జరగదు. కావ్తే ప్రేక్టిస్ చేస్తూ ఉండిపోతామూ లేప్తే మేస్ట్రేట్‌గా (మేజిస్ట్రేట్‌గా) గానీ జెడ్జిస్‌గా గానీ జాబొస్తే వెళ్ పోవ్టమూ, ఈ రెండిట్లో ఏదో ఓటి జరుగుతుంది.

(మీరు ఫోర్జరీ కేసెస్ ఎలా డీల్ చేస్తారు?)

దానికేంజేస్తారంటే హయ్‌ద్రాబాద్‌గానీ సిమ్లాగానీ ఇలాఁ ఎక్కడున్తే అక్కడ ఎవరు దీన్ని బట్టి (ఎవరిష్టం ప్రకారం) వాళ్లక్కడ పంపిస్తారు. తరాత అతన్ దగ్గరనుండి ఒపీనెన్ ఒస్తది. 'నా సంతకం కాదు' అని వాదిస్తాడ్‌గదా, అతన్ సంతకాల్ కొన్ని తీస్కుంటారు. తరాత ఈ ప్రోనోట్‌మీద ఉన్న సంతకం ఈ సిగ్నిచర్స్ అన్నీ కల్పి పంపుతారు అక్కడికి. ఈ స్పెసమన్ సిగ్నిచర్స్‌తో కల్పి, మనం కోర్ట్‌లో పెట్టాప్ అన్నాట. ఫోర్జిరీ మేమ్ ఇవి హేండ్‌రయ్‌టింగ్ ఎక్స్‌పెర్ట్‌కి పంపించ్చాలన్‌కుంటున్నాం అంటే జెడ్జి పంపుతారన్నాట. త్రూ కోర్ట్ ఎల్లాయ్. అక్కడనుండి ఓపీన్‌యిన్ (ఒపీనియన్) ఒస్తుంది. అక్కడండి వాళ్ళు సాదారన్నంగ ఈ ఇంన్ఫ్లీన్‌సెస్‌కు లొంగరేమో అన్ చెప్పేసి అన్కోటం తప్పితే ప్రతీదాన్ని సస్పెక్ట్ చేస్తూ పోతె పార్టీ గెలవ్డు మనకి దయ్‌ర్యెం కెయ్‌లేం కేసు. సో, అన్నీ బాగ్నే ఆరూతున్నాయ్ అనోకున్ కేస్ ప్రొసీడ్ అయిపోవాల్సిందే.

హేండ్‌రయ్‌టింగ్ ఎక్స్‌పెర్ట్ అంటే ఎవరో వాళ్ళు! మనకు తెలియదు కదా! ప్రేవేట్ ప్రేక్టిష్నర్స్ వాళ్ళు గూడా, తప్తే రిజిస్టర్డు. వాళ్ళు అడ్వొటయ్‌జ్మెంట్సు ఉటాయ్ లా బుక్స్‌లోను, వాటిల్లోను, డయ్‌జిటిలోను వాటిల్లోను, సో దాన్‌బట్టి ఎవళ్‌కో ఒకళ్ళకు పంపుతారు అన్నాట. వాళ్ళ ఒపీన్యెన్ ఒచ్చిన్ తరవాత ఒక కమీషన్ని అపాయ్‌న్ట్ చేస్తారు, వాళ్ళు ఎవిడెన్స్ రికార్డ్ చెయ్‌డాన్కి. బోత్‌సయ్‌డు ఎడ్వకేట్సు మళ్లీ అయా దీన్ని, వాళ్లిచ్చిన ఒపీన్‌యెన్ని "ఏయే దీన్‌వల్ల మీరు ఈ కన్క్లూజన్కొచ్చారు అన్ చెప్పేసి పీళ్ళడుగుతారు. అలా రావ్‌డాన్కి కారనాలేమిటి? ఇలా అయ్యుండొచ్చు గదా అలా అయ్యుండొచ్చుగదా అన్‌చెప్పేసి ఉన్న లాయరు క్రాసెగ్జామినేషన్ చేస్తాడన్నాట. ఆ ఎవిడెన్స్ ఏమో కమిటీలో కమీష్నర్ రికార్డ్‌చేసి అది కోర్ట్‌లో ఫయ్ చేస్తాడు.

(కేవలం దీనిమీదనే ఆధారపడుతుందా కేసు ?)

ఆదారపడదు (ఆధారపడదు) ఎందుకంటే జెడ్జి ఆ ఒపీన్‌యెన్ని బిలీవ్

| | |
|---|---|
| తాటాతూటం | ఏదో సర్దుబాటు |
| తాటిపెండె | తాటిచెట్ల వరుస |
| తాతమ్మ | తాత తల్లి |
| తాపితా | పట్టుబట్ట |
| తాపీ | సిమెంటు పనులుచేసేవారు వాడే ఒక పరికరము |
| తాపీ మేస్త్రి | తాపీపని చేసేవాడు |
| తిండి | భోజనం |
| తిత్తవ | వృత్తాంతం |
| తిన్నగా | తిన్నగా |
| తిప్పివు | 1. కష్టం<br>2. బోల్తా |
| తియ్యగురు | మామిడి తాండ్ర |
| తిరగలి/తిరవలి | విసురాయి |
| తివ్వ | తీగ |
| తీంతారు | పాడుచేయడం |
| తీపిదిగెయ్యి | నష్టం కలుగడం |
| తుంబ పెంచు | బొజ్జ పెంచడం |
| తుడుచు | ఊడ్వడం |
| తునకాలు | తక్కెడ |
| తూనికరాళ్ళు | తూచేబాట్లు, రాళ్లు |
| తెండడం | తోడడం |
| తెట్టతెన్నుగా | అనుకోకుండా |
| తెళ్ళం | మయం, నిండా |
| తేట్ | సాఫ్‌గా |
| తేడా | వ్యత్యాసం |
| తేరీగా | పూర్తిగా |
| తొడపారం | హీనం |
| తొడ్డ | వెంటనే |
| తొర్వడం | కలపడం (ఈ క్రియ ద్రవపదార్థాలకి మాత్రమే వాడుతారు) |
| తొలీగ్గ | మొట్టమొదలు |
| తొల్యాచ్చారు | మొదటి |
| తొవ్వ | తవ్వడం |
| తొంగోడం | పడుకోడం |
| తోటన్నలు | అక్కచెల్లెళ్ల భర్తలు |

# అనుబంధం - 2

## పదపట్టిక

| | |
|---|---|
| అంజుమానం | అండమాన్ |
| అంతస్తు | మేడ |
| అందాల | అక్కడ |
| అక్కడకాండి | అక్కడనుంచి |
| అగ్గి (నిప్పు) | నిప్పు |
| అభ్యాణీలు | 1. ఎన్నికైనవారు<br>2. వెధవ అనే అర్థంలో వ్యంగ్యంగా వాడుతారు.(రావిశాస్త్రీయం పే.9) |
| అడవి | అరణ్యం |
| అడియాలి మెరుగు | తెలుపు నునుపు చేయడం, లేదా మెరుగు పెట్టడం |
| అడ్డ | లైటు ముని |
| అడ్వెటైజ్‌మెంట్స్ | ప్రకటనలు |
| అతగాడు | అతను |
| అత్త(మ్మ) | మేనమామ భార్య, అత్తగారు, మేనత్త |
| అత్తికట్టు | మెడ |
| అత్తిగ | అన్నభార్య |
| అద్రూపాయ్ | అర్ధరూపాయి |
| అన్నదమ్ముడు | సోదరుడు |
| అప్ప | అక్క |
| అప్పచెల్లెలు | సోదరి |
| అప్పనం తీయు | పొలంలో నీరు పోవడానికి కాలువ తీయడం |
| అబ్బయ్య | పినతండ్రి |
| అబ్బాయిలు | మగపిల్లలు |
| అమ్మానాయిన | తల్లిదండ్రులు |
| అమ్మి | ఆడపిల్లని పిలిచే విధానం |
| అమ్మ | 1. తల్లి<br>2. ఆడవారిని సంభోదించేది |
| అయ్‌గోరు | అయ్యగారు |

| | |
|---|---|
| అయిదారు జనం | అయిదారుగురు/అయిదారుమంది |
| అయ్దు | సంఖ్య అయిదు |
| అయ్ద్ దఫాలు | అయిదుసార్లు |
| అరక | మంచ |
| అలంగ/అలాంగ | అలాగ |
| అలపొద్దు | సాయంత్రం |
| అలబొట్టి/ఆడబొట్టి | ఆడబిడ్డ |
| అల్లక్కడ | అక్కడ |
| అసలుమేస్త్రి | పెద్ద మేస్త్రి |
| ఆ గడికి | ఆ ఘడియకు |
| ఆగిపోవు | నిలిచిపోవడం |
| ఆగ్న | ఆనతి |
| ఆడపిల్ల | కూతురు |
| ఆఫీస్ | కార్యాలయం |
| ఆభోర్ | గౌరవం |
| ఆమ్దవ్రుక్షం | ఆముదం చెట్టు |
| ఆరంభించు | మొదలు పెట్టడం |
| ఆలకించు | వినడంవి |
| ఆలోచించుకొను | ఆలోచించడం |
| ఆవు | ఆవు |
| ఇంట్రస్టు | ఇష్టము |
| ఇంతకు ముందరి | ఇంతకు పూర్వం |
| ఇందల | ఇందులో |
| ఇందాల | ఇక్కడ |
| ఇంప్రెషన్ | అభిప్రాయం |
| ఇకటం (<వికటం) | పరాచికం |
| ఇటువంటి వల్ల | ఇటువంటివి అన్నీ |
| ఇడుకొను | ఉంచుకోడం |
| ఇడుపు గింజ (<ఈడుపుగింజ) | చిల్లగింజ |
| ఇత్తనం (<విత్తనం) | |
| ఇద్దరు | ఇద్దరు |
| ఇద్దుం | రెండు తూములు |
| ఇన్కమ్ | రాబడి |
| ఇత్తి | వృత్తి |

| | |
|---|---|
| ఇలాటి | ఇటువంటి |
| ఇలాయి బుడ్డి | కిరసనాయిలు/క్రొత్త తగిలించే రేకు దీపం బుడ్డి |
| ఇల్లిక్కడ | ఇక్కడ |
| ఇల్లీడు | వీడు |
| ఇవక పట్టిపోవు | బాగా తడి పీల్చుకోపోవడం |
| ఇవుడు | ఇప్పుడు |
| ఇసక | ఇసక |
| ఇస్కూలు | బడి |
| ఈవినింగ్ | సాయంకాలం |
| ఉడుచు | నాటు (వరినార్లు వంటివి) |
| ఉణుస్లు | ఊడ్పులు, నాట్లు |
| ఉద్దోగం | ఉద్యోగం |
| ఉన్నాది | ఉంది |
| ఉప్పుడు | ఇప్పుడు |
| ఉభాలు | ఊడ్పులు, వరినాట్లు |
| ఊజు | చేపలు పట్టుకునే తట్ట |
| ఊజేరు | గుత్తులు గుత్తులుగా ఉండే చెట్టు వేళ్ళు |
| ఊడు | ఇప్పుడు |
| ఊదలు | సామలు |
| ఊపిరి | స్వాస |
| ఊరు | ఊరు |
| ఎందాల | ఎక్కడ |
| ఎకరం | ఎకరం |
| ఎక్కతీసీయ్డం | విప్పితీసేయడం |
| ఎక్స్ట్రా | అదనం |
| ఎద్లు | గొడ్లు |
| ఎత్తిరిల్లడం | పడిపోయినవాడు పైకి లేవడం |
| ఎత్తిలించడం | హెచ్చు చేయడం |
| ఎత్తేసరం | అతియాస |
| ఎనకడం | వెతకడం |
| ఎప్పుడు | ఎప్పుడు |
| ఎర్రదుంపలు | కందమూలాలు |
| ఎల్ పోచ్చేసీను | వెళ్ళిపోయాను |

| | |
|---|---|
| ఎల్డర్స్ | పెద్దవాళ్లు |
| ఎల్లుండి | రేపటికి ఆవలిదినము |
| ఎవిడెన్స్ | సాక్ష్యము |
| ఏరాలు | సవితి |
| ఏరియాస్ | ప్రాంతాలు |
| ఏళ్ళు | సంవత్సరాలు |
| ఏవలేయు | దాహం వేయడం |
| ఏడ్వకేట్స్ | న్యాయవాదులు |
| ఒండ్రు | సిమెంటు, ఇసుక బాల్చీలో పల్చగా కలిపినది. ఇది ప్లాస్టరింగ్ చేసేటప్పుడు వాడుతారు. |
| ఒక దఫాన | ఒకసారి |
| ఒక్కులు | ఇడ్లీలు |
| ఒట్కొని | పట్టుకొని |
| ఒత్తడం | తుడవడం |
| ఒపీనియన్ | అభిప్రాయము |
| ఒప్పుము | ఒప్పుకోము |
| ఒర్రగుండ | మిరపపొడి |
| ఒర్రుగా | పల్చగా |
| ఒళ్లు | శరీరం |
| ఓప్క | ఓపిక |
| ఓరెం | కల్లం వేయడానికి వాడే మట్టిపాత్ర |
| కంక్లూజన్ | నిర్ణయం |
| కందిరి కట్టు | కం కురుపు |
| కం[illegible] | కొబ్బెర చీపురు |
| కట్టు | కట్టడం |
| కత్తుకలుపు | స్నేహం చేయడం |
| కన్నం | బెజ్జం. రంధ్రం |
| కన్నెగీరు | కంటి కురుపు |
| కమాను | కేంపు |
| కమిట్ అవు | మాట ఇచ్చుట, ఒప్పుకోడం |
| కమిషన్ | ఒక పని చేయడానికి ప్రత్యేకంగా నియమించిన అధికార సంఘం |
| కమీషనర్ | పరిశీలనాధికారి |
| కమ్మి | ఒక ఆభరణం పేరు. |
| కయ్యము | పోట్లాట |

| | |
|---|---|
| గుజురు/గుడ్డు | కొబ్బెర |
| గుడ్డి | వానాధారమైన భూమి, మెట్టపొలం |
| గుత్తులు | పాదాలు |
| గెదర | మాంసం |
| గేట్ కాపేయు | గేట్ దగ్గర కాపలా ఉండడం |
| గేదెలు | బర్రెలు |
| గొంగల్లు | గొంగళ్ళు |
| గొప్ప | చాలా |
| గొల్లు | అల్లరి |
| గొల్లోడు | గొల్లవాడు |
| గొల్లోల్లు | గొల్లవాళ్లు |
| గోణేబిళ్ళ | బిల్లాకర్రా ఆట |
| గోనంకెం | గోనెసంచి |
| గోలి | సందు |
| చర్మమ్ | తోలు |
| చలవ దుంపలు | ఒకరకం దుంపలు |
| చవ్క | చవక, అగ్గవ |
| చానాళ్ళు | చాలా రోజులు |
| చార కంద | తియ్యని ఒక జాతి కంద |
| చింత గీరు | కీచురాయిచేసే ధ్వని |
| చిప్పుకొట్టు | చీటా చేయడం |
| చిల్లి | దువ్వారిపోతన్న పండుగ |
| చుట్లు | సారు |
| చెక్ సున్నాలు చేయు | ఇళ్లు మొదలైనవి కట్టేటప్పుడు సున్నము లేదా సిమెంటుతో గచ్చుచేయడం |
| చెరుగు | చేటతో బియ్యము, పప్పులు బాగుచేయడం |
| చెవలపిల్లి | కుందేలు |
| చేత్రాలు | క్షేత్రాలు |
| చేలు/చేన్లు/చేళ్ళు | పంటచేలు |
| చోళ్ళు | రాగులు |
| జబ్బు | 1. రొంప<br>2. రోగం |
| జల్లెడ | జల్లించే పరికరము |
| జాదువ | తోడికోడలు |
| జాబ్ | ఉద్యోగం |
| జీవించు | బతకడం |

| | |
|---|---|
| కూలీలు | పనివాళ్లు, జీతగాళ్లు |
| కేసెస్ | కేసులు, విచారణాంశాలు |
| కొన్‌దఫాలు | కొన్నిసార్లు |
| కొట్లాడు | పోట్లాడడం |
| కొడుపు | కడుపు |
| కొదాలు | పశువులు (చిన్నవి) |
| కొన్నాళ్ళు | కొన్నిరోజులు |
| కొయ్య | ముల్లు |
| కొర్నుంచు | కొర్ను మేపడం |
| కొర్నాగ్గేయు | వ్యవసాయం చెయ్యకుండా భూమిని వదిలెయ్యడం |
| కొర్లు (<కొఱ్రలు) | ఒక ధాన్య విశేషం |
| కోక | చీర |
| కోనారి | గొల్ల |
| కోపి దుంప | నూల్‌కోల్ |
| కోపేరు | నులకలో ఒక రకం |
| కోర్టు | కోర్టు, న్యాయస్థానం |
| కోవిల/కోవిలె | గుడి, దేవాలయం |
| గండిక | 1. అల్లరి<br>2. ఏదైనా సంబరం చేసుకోడం |
| గండికవు | నిస్సహానంతో ఆందోళన చెందడం |
| గజాలు | చూవలు |
| గడేకుండలు/గరేకుండ | సన్నమూతిగల ఇత్తడిబిందెలు |
| గడ్డ | 1, పంటకాలువ (పెద్దది)<br>2. ఏరు |
| గత్తం | ఎరువు (పెంటెరువు) |
| గమ్మున | త్వరగా |
| గల్లా | కిరోసిన్ పంప్ |
| గాయకం | ప్రియం |
| గావంచ | తువాలు |
| గిలక్కి నీరు దిగడం | బుర్ర తిరగడం |
| గుంట | ఆడపిల్ల |
| గుంటడు | మగపిల్లవాడు |
| గుండ | పొడి |
| గుండాం | హడావుడి |

| | |
|---|---|
| తాటూతూటం | ఏదో సర్దుబాటు |
| తాటిపెండె | తాటిచెట్ల వరుస |
| తాతమ్మ | తాత తల్లి |
| తాపితా | పట్టుబట్ట |
| తాపీ | సిమెంటు పనులుచేసేవారు వాడే ఒక పరికరము. |
| తాపీ మేస్త్రి | తాపీపని చేసేవాడు |
| తిండి | భోజనం |
| తిత్తవ | వృత్తాంతం |
| తిన్నగా | తిన్నగా |
| తిప్పివు | 1. కష్టం<br>2. బోల్తా |
| తియ్యాగురు | మామిడి తాండ్ర |
| తిరగలి/తిరవలి | విసురాయి |
| తివ్వ | తీగ |
| తీంతారు | పాడుచేయడం |
| తీపిదిగెయ్యి | నష్టం కలుగడం |
| తుంబ పెంచు | బొజ్జ పెంచడం |
| తుడుచు | ఊడ్వడం |
| తునకాలు | తక్కెడ |
| తూనికరాళ్ళు | తూచేబాట్లు, రాళ్లు |
| తెండడం | తోడడం |
| తెట్టతెన్నుగా | అనుకోకుండా |
| తెళ్ళం | మయం, నిండా |
| తేట్ | సావ్‌గా |
| తేడా | వ్యత్యాసం |
| తేరిగా | పూర్తిగా |
| తొడపారం | హీనం |
| తొడ్డ | వెంటనే |
| తొర్వడం | కలపడం (ఈ క్రియ ద్రవపదార్థాలకి మాత్రమే వాడుతారు) |
| తొలీగ్గ | మొట్టమొదలు |
| తొల్యాచరు | మొదటి |
| తొవ్వ | తవ్వడం |

| | |
|---|---|
| జుడిషియల్ | న్యాయబద్ధమైన |
| జూనియర్స్ | జూనియర్లు |
| జెగిలిగాడు | తోడల్లుడు |
| జెడ్జి | న్యాయమూర్తి |
| జోక్ చేయు | పరిహాసం చేయుడం |
| ట్రుబుల్ సంగా | ఇబ్బందిగా |
| టిక్కట్టు | టికెట్ |
| టీ | టీ |
| టెన్ | సంఖ్య పది |
| టేకప్ చేయు | చేబట్టడం |
| టోపీ అల్లు | మోసం చేయడం |
| డబ్బు/దొబ్బు | డబ్బు, ద్రవ్యము |
| డవ్వులు | రంగు |
| డయ్‌జిట్లు | సంగ్రహముగా చేసిన గ్రంథం |
| డయ్‌వోరు/డయ్‌వోరు | 1. సినిమా నడిపే ఆపరేటర్<br>2. మోటార్ డ్రైవర్ |
| డాట్రు | డాక్టరు, వైద్యుడు |
| డాబా | మేడ, అంతస్థు |
| డాల్ పప్పు | వండిన పప్పు |
| డిగ్నిఫయ్‌డ్ | గౌరవ గల, హోదాగల |
| డిమానిస్టర్ | డిమాన్‌స్ట్రేటర్ |
| డిస్క్రీషను | అభిప్రాయము, తనకు ఉచితమని తోచిన విధంగా నిర్ణయించే స్వేచ్ఛ |
| డెంకి | ధాన్యం దంచడంలో ఉపయోగపడే ఒక పరికరము |
| డొంకసాటు | కంచ |
| డొంగో | గర్వం |
| డోకి | నీళ్లు తోడడానికి కొబ్బరి చిప్పతో తయారు చేసిన గరిటె వంటిది |
| తండాగా | తృప్తిగా |
| తప్పు | ఒప్పుకానిది |
| తప్పెటగుళ్లు | ఒక ఆట |
| తఖావతు | తేడా |
| తయ్‌పారు | సరిపోల్చడం |
| తర్టీ | ముప్పై |
| తాంబేలు | టిన్ |

| | |
|---|---|
| దుక్కి | 1. వాన పరిమాణపు కొలత<br>ఉదా: ఇన్ని దుక్కుల వర్షం కురిసింది |
| దుక్కిచినుకులు | దున్నటానికి వీలైనంత వర్షం |
| దుక్కతన్నేయడం | లావవడం |
| దుక్కిపూయు | బండికి ఎద్లు కట్టడం |
| దుమ్ములు | ఎముకలు |
| దుస్సపోతు | చెవలపిల్లి |
| దూబ | అల్లరి |
| దేవుడు | భగవంతుడు |
| దొడ్డ(మ్మ) | పెద్దమ్మ |
| దొడ్డయ్య | పెత్తండ్రి |
| దొంగరేయి | నడిరాత్రి |
| దొంగాటకం | దొంగతనాలు జరగడం |
| దోయిం(<ద్రోహం) | మోసం |
| నడవ | 1. ఇంటిముందు స్థలం<br>2. రెండిళ్ళమధ్య స్థలం |
| నఫిరి | వెకిలి పనులు చేసేవాడు |
| నమ్మకం | నమ్మకం |
| నయ్ట్ కాలేజ్ | నైట్ కాలేజీ |
| నయ్ట్స్ | రాత్రిళ్ళు |
| నవ్కిరి | ఉద్యోగం |
| నవుజు | చాలా లేతవి |
| నాంగలి | నాగలి |
| నాగులు | చెవులకు పెట్టుకునే ఆభరణం |
| నాను | 1 నేను<br>2. పట్టెడ నగ |
| నాభి | నల్లమందు వంటి విషతుల్యాలు |
| నార | మాంసం |
| నిండు | భర్తీ అవడం |
| నికటం | నిజం |
| నిగాడు | హీనం |
| నిగుడు | 1. నిక్కు<br>2. లాగడం |
| నిఘావేసుక్కూచోడం | ఊరికే కూచుని పనులు ఎగెయ్యడం |
| నిచ్చాటు | నిశ్శబ్దం |
| నిజమంతరాలు | నిజాయితీపరురాలు |

| | |
|---|---|
| తోటల్లుళ్లు | అక్కచెల్లెళ్ల భర్తలు |
| తోశెం | కొంచెం |
| త్రూకోర్ట్ | కోర్టు ద్వారా |
| దగ | దాహం |
| దగలా | ప్రదర్శనకోసం వేసుకొనే అలంకారపుదుస్తులు |
| దద్ద | పింతంత్రడి |
| దనము | డబ్బు |
| దనరు | ప్రభావము |
| దన్ను | హామీ |
| దనుర్మవ్వా ఉండ | పేలాలతో తయారుచేసే ఒక తిండి పదార్థము |
| దప్పిక తాగడం | గంజి తాగడం |
| దరావు | త్రాగుడులో ఒక కొలత |
| దరిద్రాలు | చెడు పనులు |
| దవ్వ | దూట |
| దస్కం | పది రూపాయలు |
| దాక | కుండ |
| దాగర | విశాలమైన మేదర బుట్ట |
| దాన్యమాడు | వడ్లని మిల్లులోవేసి బియ్యం చేయడం |
| దాపకర్ర | నిచ్చెన |
| దాపల | ఎడమ |
| దాపాడు | దాచడం |
| దాయి | 1. పిల్ల<br>2. తల్లి అనే అర్థం<br>3. స్త్రీలింగ ప్రత్యయం<br>ఉదా : కూలిదాయి |
| దికుక్క/దుక్కు | పక్క, దిశ |
| దిగసన | తక్కువ |
| దిడ్డి | 1. పెరడు<br>2. చిన్న కిటికీ |
| దిబ్బడాలు | పచ్చిగా ఉన్నవి (కాయలు) |
| దిలాసా | నిబ్బరం |
| దివ్వ | దీపం |
| దివ్వలు | దసరాకుచేసే ఉత్సవం |
| దీవి | చూడాలనే కోరిక |
| దుక్కిపోతు | పోతు |

| | |
|---|---|
| దుక్కి | 1. వాన పరిమాణపు కొలత<br>ఉదా: ఇన్ని దుక్కుల వర్షం కురిసింది |
| దుక్కిచినుకులు | దున్నటానికి వీలైనంత వర్షం |
| దుక్కతన్నేయడం | లావవడం |
| దుక్కిపూయు | బండికి ఎడ్లు కట్టడం |
| దుమ్ములు | ఎముకలు |
| దుస్సపోతు | చెవలపిల్లి |
| దూబ | అల్లరి |
| దేవుడు | భగవంతుడు |
| దొడ్డ(మ్మ) | పెద్దమ్మ |
| దొడ్డయ్య | పెత్తండ్రి |
| దొంగరేయి | నడిరాత్రి |
| దొంగాటకం | దొంగతనాలు జరగడం |
| దోయిం(<ద్రోహం) | మోసం |
| నడవ | 1. ఇంటిముందు స్థలం<br>2. రెండిళ్ళమధ్య స్థలం |
| నఫిరీ | వెకిలి పనులు చేసేనాడు |
| నమ్మ్రకం | నమ్మ్రకం |
| నయ్ట్ కాలేజ్ | నయ్ట్ కాలేజీ |
| నయ్ట్స్ | రాత్రిళ్ళు |
| నవ్ కిరీ | ఉద్యోగం |
| నవుజు | చాలా లేతవి |
| నాంగలి | నాగలి |
| నాగులు | చెవులకు పెట్టుకునే ఆభరణం |
| నాను | 1 నేను<br>2. పట్టెడ నగ |
| నాభి | నల్లమందు వంటి విషతుల్యాలు |
| నార | మాంసం |
| నిండు | భర్తీ అవడం |
| నికటం | నిజం |
| నిగాడు | హీనం |
| నిగుడు | 1. నిక్కు<br>2. లాగడం |
| నిఘా వేసుక్కూచోడం | ఊరికే కూచుని పనులు ఎగెయ్యడం |
| నిచ్చాటు | నిశ్శబ్దం |
| నిజమంతరాలు | నిజాయితీపరురాలు |

| | |
|---|---|
| నిట్ట మొయ్యడం | బాధ్యత తెలియడం |
| నిద్దగా | గట్టిగా |
| నిబ్బంగ | నిజంగా |
| నిరంగు | పేకాటలో ముక్క కలపక పోతే అంటారు |
| నీటి ధార | నీటి పారుదల |
| నీరటి పెట్టడం | నైవేద్యం పెట్టడం |
| నీరు తెండడం | నీరు తోడడం |
| నీరు పూనడం | నీరు నిలవడం |
| నీవు/నువ్వు | నువ్వు |
| నూర్రగాపాల్లు | వందరూపాయలు |
| నూలు | నువ్వులు |
| నెత్తి | తల |
| నెముకు | వెతకడం |
| నేతి దొండకాయలు | ఒక రకం దొండకాయలు |
| నేస్తపోరు | స్నేహితులు |
| నేస్తరికం | స్నేహం |
| పంచపాళీ | చిన్నకొట్టు గది |
| పంటలు | ఏళ్లు, సంవత్సరాలు |
| పండిటికి(పండు + ఇటికి) | కాల్చిన ఇటికె |
| పంపు | పంపించడం |
| పంపుకొట్టు | కుపామత్తు చేయడం |
| పకాలి | చల్దన్నం |
| పక్కలోరు | ఇరుగు పొరుగు |
| పగలు | పొద్దున్నుంచి సాయంత్రం వరకు |
| పగిడీ | పాగా |
| పచ్చిటికి | కాల్చని ఇటికె |
| పటం (<దేవుడి పటం) | ఫొటో |
| పటపటాంగం | ప్రత్యర్థిని ఎదుర్కోడం |
| పటాటోపం | ఆర్భాటం |
| పడమట/పరమట | తూర్పుకు ఎదురుగా ఉన్న దిశ |
| పడున్నాడు | పడుకున్నాడు |
| పడ్డపెయ్యి | ఎదిగిన దూడ |
| పదకొండు మనిషి | పదకొండుమంది |
| పనిమనిషి | పనిచేసే మనిషి |
| పనివాళ్ళు | జీతగాళ్ళు |
| పన్నులు | టాక్సులు |

| | |
|---|---|
| పన్నె/పన్ని/పయ్ని | దువ్వెన |
| పయ్లో పయ్సాలు | దగ్గర డబ్బుండడం |
| పరుడు | నిచ్చెన |
| పర్ర | పనికిరాని భూమి |
| పల్కత్ర | పళ్ళుతోము పుల్ల |
| పల్కర్ర చేయు | పళ్ళు తోమడం |
| పల్దోంపుల్ల చేయు | ,, |
| పలకం పున్నం | మార్గశిర పున్నమి |
| పలుకు బడి చేయు | మాట్లాడడం |
| పల్లకొన్నారు | ఊరుకున్నారు |
| పళ్ళు | 1. నోట్లోపళ్ళు<br>2. పండ్లు |
| పాంజేబు పట్టీలు | కాళ్లకు వెండినగ |
| పాటూన్నాలు | సన్నసూాలు |
| పాతిక నీళ్లు | పావువంతు నీళ్ళు |
| ప్లాన్లు | పాన్లు |
| పాప | 1. ఆడపిల్ల<br>2. చిన్న ఆడపిల్ల |
| పాయింట్ | ఒక విషయంలోని ముఖ్యాంశం |
| పాఠ | వ్యవసాయంలో ఒక పనిముట్టు |
| పారాడు | తిరుగు |
| పార్టీ | క్లైంటు |
| పాలగుండ | పాలపొడి |
| పాలపుల్లలు | తెల్ల బలపం |
| పాలి | సారి |
| పాలు తిరగేయు | పాలు పారబోయడం |
| పాళెం | పాదు |
| పింగులు | డబ్బులు |
| పికరు | ఆచూకి, అయిపు |
| పిటీషన్ | వినతి పత్రం |
| పిలక తిరగడం | బుర్ర తిరగడం |
| ప్లిల్లడు | పిల్లవాడు |
| పిల్లికూనలు | రూపాయలు |
| పీక | మెడ, గొంతు |
| పీకదాను | ఉమ్ముకోడానికి ఉపయోగించే సమ్మె |
| పీనె | పెళ్ళిపీట |

| | |
|---|---|
| పీపి | బొత్తిగా లేతవి |
| పుంజు | మగాడు |
| పుంజీ | నాలుగు, కొద్దిగా |
| పుచ్చుకొను | తీసుకోడం |
| పుట్టురోజు | పుట్టినరోజు |
| పుట్టి | ఒక కొలత విశేషం |
| పుడత/పుడ్త | చూ: కుడుత |
| పుడమి | భూమి |
| పుత్రాకూతురు | అన్నదమ్ముల కూతురు |
| పుత్రాకొడుకు | అన్నదమ్ముల కొడుకు |
| పులిసిపోవడం | బాగా డబ్బు, దర్పం ఉండడం |
| పుల్ల | పులుపు |
| పురితాడు | సుతిల్తాడు |
| పుదకిపోవు | తప్పిపోవు |
| పూజు/పూదు | కాది |
| పూటీలు | పుట్టు వెంట్రుకలు |
| పూదు | చూ: పూజు |
| పూనాస | కాలంకాని కాలం |
| పూను | ఎత్తుపోలాలకు నీళ్ళు మళ్లించడానికి వేసే అడ్డకట్ట |
| పూపు | సామ్యం |
| పూర్వోగం | కర్మ |
| పెండిసాటు | సరిగా వినిపించనివాళ్ళని అంటారు |
| పెండె | చూరు |
| పెట్ట | ఆడది |
| పెడ | అత్తం |
| పెణక | చూరు |
| పెద్దమ్మ | తల్లి అక్క |
| పెనిమిటి/పెనివిటి/పెరిమిటి | భర్త |
| పెమాండకం | ప్రమాణం |
| పెమాండకం చెయ్యి | ప్రమాణం చెయడం |
| పెరుగు | ఎక్కువ అవడం |
| పెళ్ళాడు | పెళ్ళి చేసుకొనడం |
| పెసర కట్టు | ఒక వంటకం |
| పేలు/పేన్లు | తలలో పేలు |
| పేరంట్స్ | తల్లిదండ్రులు |

| | |
|---|---|
| పేదాయం | పేదరికం |
| పొంకం | ఠీవి |
| పొణక | పెద్దసైజు బుట్ట |
| పొడగట్టు | తోచడం |
| పొద్దుకల్లా | పొద్దంతా |
| పొద్దుట | పొద్దున/ఉదయం |
| పొద్దుతూరు | పొద్దు పొడవడం |
| పొద్దుములుగు | పొద్దుకూకడం |
| పొరుగోరు | ఇరుగుపొరుగువాళ్ళు |
| పొర్లు | దాటడం |
| పొలుచు | చేటతో బియ్యంలో రాళ్ళు వేరుచేసే ఒక విధానం |
| పొవ్వాకు | పొగాకు |
| పోకఉండలు | ఒక పిండి వంట |
| పోగు | భోజనము |
| పోతు పెయ్య | నుగమూడ |
| పోరిడు పిట్ట | పొట్టి మనిషి |
| పోలు | పాలు |
| పోసిలు | మణికట్టు |
| పోస్టు | పదవి |
| ప్రతిపూట | అన్ని వేళలు, అన్నిపూటలు |
| ప్రపంచకం | ప్రపంచం |
| ప్రయార్టీ | ప్రాధాన్యం |
| ప్రవేశించు | ప్రవేశించడం |
| ప్రిఫర్ చేయు | ఎన్నుకోడం |
| ప్రేర్ధన | ప్రార్థన |
| ప్రోనోటు | ప్రోనోటు |
| ప్రోమోషిన్స్ | ప్రమోషన్ |
| ప్రోసీడ్ అయ్‌పోవు | ముందుకి సాగిపోవడం |
| పయ్‌వోళ్ళు | పెద్దవాళ్ళు |
| ఫైయల్ చేయు | కేసు వేయడం |
| ఫయ్‌లింగు | కేసు |
| ఫరక్ | విశేషం ప్రత్యేకార్థం |
| ఫాదర్ | తండ్రి |
| ఫికర్ లేకుండాపోవు | జాడతెలీకుండా పోవు |
| ఫెస్లిటీ | సౌకర్యం |
| ఫొటో | ఫొటో |

| | |
|---|---|
| ఫోర్జరి | దొంగ సంతకం |
| ఫ్రెండ్స్ | స్నేహితులు |
| బంటా | గుమ్మి |
| బండిపూయు | బండికి ఎడ్లు కట్టడం |
| బక్కలు | పశువులు |
| బక్తుడు | భక్తి గలవాడు |
| బగవంతుడు | భగవంతుడు |
| బజారు | మార్కెటు |
| బజిన | భజన |
| బట్టి | గడ్డ కంటే చిన్న ప్రవాహం, కాలువ |
| బద్దు | తీగె |
| బయ్‌ట పీపిల్ | బయటవాళ్లు, సంబంధం లేనివాళ్ళు |
| బయ్‌సి తియ్యు | సిగ్గుతియ్యడం, పరువుతియ్యడం |
| బయము | భయం |
| బరిక /బరికె | కొబ్బరిపెంకు, చిప్ప |
| బల్ల | పలక |
| బవిష్యం | గౌరవం |
| బస్తా | నింపిన గోనెసంచి |
| బాతుపిట్టలాగుండు | సంతృప్తిగా ఉండు |
| బాప్ప | మేనత్త |
| బాబయ్య/బావయ్య | పినతండ్రి |
| బారుగా అవుపడు | చాలా బాగున్నట్టు కనబడడం |
| బాలి | ముక్క, ఒకదానిలో (వస్తువులో) సగ భాగము, ఉదా: కొబ్బరబాలి |
| బాల్చి | బక్కెటు |
| బిగురు | పెద్దమాటలాడు, ప్రగల్భాలు పలుకు |
| బిడ్డి | చిన్న బిందె, చిన్నకుండ |
| బిలీవ్ చేయు | నమ్మడం |
| బీపి | వీపు |
| బీష్మదేకాదసి | భీష్మేకాదశి |
| బుక్కాభర్గుండ | రంగులపొడి |
| బుక్కావోడు | కుంకం మొదలైనవి అమ్మేవాడు |
| బుక్కుల్ పోపు | భయపడడం |
| బుక్సు | పుస్తకాలు |
| బుగత | చుట్టం, భూస్వామి |
| బుర్ర తిరుగుడు | అహంకారం |

| | |
|---|---|
| బులావులు | మంచిమాటలు |
| బులుపు | ఉబలాటం |
| బూరగాలు | బోదకాలు |
| బెంటు | అనాగరికుడు |
| బెర్రు | బెదురు |
| బెసారో/బెసారు | అన్నీ కలిపి వండినకూర |
| బేగి | త్వరగా |
| బేపి | కుక్క |
| బొక్క | విరిగిపోయిన, బోసి |
| బొట్టి | ఆడపిల్ల |
| బొట్టె | 1. ఆడపిల్ల<br>2. మగపిల్లవాడు |
| బొట్టెడు | మగపిల్లవాడు |
| బొణిపె | బొడిపె |
| బొతుకు | బ్రతుకు |
| బొమ్మల్లా పడటం | బోర్లాపడడం |
| బోంచేయు | తినడం |
| బోగట్టా | వార్త, కబురు |
| బోగబందా | స్వాధీనపు తనఖా |
| బోజీ (<భోజీ) | విందుభోజనం |
| బోజు | మంచి అభిమానంతో చూడడం |
| బోదురుకప్ప | గోదురుకప్ప |
| బోయిరోడు | చెవిటివాడు |
| బరువసా | ఆసరా |
| బోర్డుఆపు | బోర్డు చెరపడం |
| మంటి | మట్టి |
| మండిక/మండిగె | మట్టి చిప్ప |
| మట్టు | తొక్కడం |
| మణె | కరణం |
| మడక | ప్రాంతం, ప్రదేశం |
| మడి | చెరువాధారమైన పంటభూమి |
| మడికట్టు వర్షం | దుక్కివర్షం |
| మడియారి/మడియాలి | చాకలి |
| మందడి | మధ్య |

| | |
|---|---|
| మదుం | కాలువ, వంతెన వంటి కట్టడం క్రింద నుంచి వచ్చే ప్రవాహం |
| మనమరాలు | కొడుకు/కూతురుయొక్క కూతురు |
| మనసు | మనసు |
| మయ్ మర్చిపోవు | లీనమయ్ పోవడం, తన్మయత్వం చెందడం |
| మహో | గొప్ప, చాలా |
| మాకాడికి మీకాడికి | మాకూమీకూ మధ్య |
| మాకెక్కడెక్కల్తాది | మాకు ఎక్కడ సరిపోతుంది |
| మాట కాయు | మాట పడడం |
| మాటమిగులు | నోటికొచ్చినట్టు మాట్లాడడం |
| మానె అవడం | ఇబ్బంది పడడం |
| మాము | మేము |
| మాయింట్లో | మా కులంలో |
| మారు దప్పిక | మరోసారిచేసే భోజనము, సాధారణంగా ఇది గంజి |
| మార్నింగ్ | పొద్దున |
| మాలలమావాస | శ్రావణ అమావాశ్య |
| మావలత్తు | ఫలితంలేని కాలక్షేపం |
| మిట్టకాయ | తుణం |
| మిత్తనాన్న | నాన్న స్నేహితుడు |
| మిత్తబావ | బావ స్నేహితుడు |
| మిత్తమామ | మామ స్నేహితుడు |
| మిత్తాత | తాతతండ్రి |
| మిద్ది | డాబా |
| మిన్నా తరహో | పెద్దమనిషి తరహో |
| మిల్లు | గిర్ని |
| మిల్లు డయ్‌వోరు | మిల్లో ఆపరేటర్ (డ్రైవర్) |
| మీట | స్విచ్ |
| మీటింగ్స్ | సభలు |
| మీది మిక్కిలి | పైగా, అదనంగా |
| మీన | మీద |
| ముంధోసకాయ | ఒకరకం దోసకాయ |
| ముచ్చిలక | పంట పండినా పండకపోయినా ఎంతో చెల్లించడానికి ఒప్పుకుని రైతు రాసి ఇచ్చిన పత్రం |

| | |
|---|---|
| ముడుకు/ముడుసు | మోచెయ్యి |
| ముడుకులు | మోకాళ్లు |
| ముత్తోమనవడు | మనవడి కొడుకు |
| ముదుమనవడు | మనవడికొడుకు |
| ముమ్మాటు | మూడుసార్లు |
| ములగటం | మునగడం |
| ములికి | ముల్లు |
| ముగ్రరుబాలు | జున్నుబాలు |
| ముగ్రాట | గ్రామదేవత కోసం చేసే వసంతం |
| మెంటల్ ప్రగొని | మనో వేదన |
| మెకం | నవరం |
| మెత్తరికం | స్నేహం |
| మేడలు | బిల్డింగులు |
| మేస్ట్రిట్ | మే జెస్ట్రిట్ |
| మొకరు | బండి మొన |
| మొక్కుకొను | దేవుడికి మొక్కడం |
| మొగపిల్లలు | కొడుకులు |
| మొగసాటు | మొగమెత్తడం (తిండిలో) |
| మొత్త | బండి తోలేవాడు కూచోడానికి కట్టినది |
| మొదాలు | ఆవులు |
| మొరుగు | సిమెంటు నీళ్ళు పల్చగా కలిపినది |
| యాతం | మనసు |
| యానపంటి | దక్షిణ వేపు, దిశ |
| యాప | సారి, దఫా |
| యాకాహోలు | ఏకాహోలు |
| యాత్ర | యాత్ర |
| రయితు | వ్యవసాయదారుడు |
| రవ్వమెరుగు | మోసాయిక్ మెరుగు |
| రాంభళప్పుండు | రామాఫలం |
| రాత్రల్ల | రాత్రంతా |
| రామదోసకాయలు | పుచ్చకాయలు |
| రామిగా | చవకగా |
| రాయంగీసలు | రెండణాలు |
| రాయం మట్టం | రెండురూపాయలు |
| రికార్డ్ చేయు | రికార్డ్ చేయడం |

| | |
|---|---|
| రిప్టేషన్ | పలుకుబడి |
| రంజు | ఒక వాద్యం, రుంజ |
| రుద్రాక్షపిల్లి | దొంగ, మోసగాడు |
| రెంటాం | మూపురం |
| రెండు | అంకెల్లో రెండు |
| రేక | చేద |
| రేకు | దుప్పటి |
| రైతాంగం పని | వ్యవసాయం పన్లు |
| రొండ్ నీళ్లు | సగం నీళ్లు |
| రొంప | జలుబు |
| రోకు | మనిషి మీద ఇష్టం |
| రొక్కడం | ఇబ్బంది |
| రోళ్ళు | రాళ్లు |
| లక్ష్మివారం | గురువారం |
| లయెఫ్ | జీవితం |
| లయలు వెయ్యు | చూ: బులావులు |
| లాయెర్ | ప్లీడరు, వకీలు |
| లాంతరు వెయ్యు | పేకాటలో పనికిరాని ముక్కలు వెయ్యడం |
| లాడూ | లడ్డు |
| లారీ | లారి |
| లావు | ఎక్కువ |
| లుంగ | మూట చుట్టబెట్టుకోడం |
| లేడీ | స్త్రీ |
| వడ్డాపన | వడ్డన |
| వన్ | ఒకటి |
| వయ్సు | ఈడు |
| వర్ణాలు | ఆవాల్లో ఒక రకం |
| వలం | లావు |
| వలిపల | కుడి |
| వలవేసిచూడు | ఆలోచించిచూడడం |
| వల్లకో | ఊరుకో |
| వికటం/ఇకటం | పరాచికం |
| వియ్యంకుడు | కొడుకు/కూతురు, మామగారు |
| వియ్యంకురాలు | కొడుకు/కూతురి అత్తగారు |
| వియ్యపురాలు | చూ: వియ్యంకురాలు |
| విస్సాటం | అజాగ్రత్త |

| | |
|---|---|
| వీగిపోవు | ఓడిపోవడం |
| వీది | బజార్ (ఇంటి బయట), రోడ్డు |
| వీరకత్తె/ఈరకత్తె | చూ: వియ్యాకురాలు |
| వీరకాడు/ఈరకాడు | చూ: వియ్యంకుడు |
| వేంపువ్వు | వేపపువ్వు |
| వేకువజాము | తెల్లవారిఝామున 4 గం॥ |
| వేగంగా | త్వరగా |
| వేని/ఏని/వేను/ఏను | చేతివేలు |
| షలగ | నూరు |
| షలాగ్గా ఉండు | సన్నగాడు |
| షివామణి | ప్రపథమంగా |
| సంగం | సంఘం |
| సంగోరు | సగం లేదా సగభాగం |
| సంచుక | తాటాకుల పుస్తకం |
| సంతకం | చేవ్రాలు |
| సన్స్ | కొడుకులు |
| సంపాదన | ఆర్జన |
| సచ్చెం చేయు | ప్రమాణం చెయడం |
| సజ్జ | తాజా |
| సతుమానం | పుస్తై |
| సదావృత్తి | తిండి |
| సమత్సరాలు | ఏళ్లు |
| సమాజకం | సమాజం |
| సమితి | |
| సయ్చ్చం | జలుబు |
| సరకత్తు | ఊరేగింపు |
| సరసాలు | ఆవాలు |
| సస్పెక్ట్ చేయు | అనుమానించడం |
| సాచికం | సాతుం |
| సాపత్యం | సామ్యం |
| సామాన్ | వస్తువులు |
| సాయిలా ఫాయిలా | స్నేహంగా |
| సార్లా | పూర్తిగా, ఉపయోగకరంగా |
| సాలుపోయు | నాగలికి ఎడ్లుకట్టి దున్నటం |

| | |
|---|---|
| సావాసం | స్నేహం |
| సిగ్నేచర్స్ | సంతకాలు |
| సినిమా ఆడు | సినిమా నడవడం |
| సిమిడి పళ్ళు | నల్లజీడి పళ్ళు |
| సిమ్మాచెలం | సింహాచలం |
| సిష్టర్స్ | అక్కచెల్లెళ్లు |
| సిక్స్ క్లాస్ | ఆరో తరగతి |
| సీంవెండి | అల్యూమినియం |
| సీనియార్టి | ఉద్యోగంలో పెద్దతనం |
| సీనెర్ ఆఫీస్ | సీనియర్ ఆఫీస్ |
| సీమపెండలం | కర్ర పెండలం |
| సుకపడు | సుఖపడడం |
| సున్నం వెయ్యి | వెల్లవెయ్యడం |
| సున్నపకాయలు | కోడిగుడ్లు |
| సుప్పులు | చక్కిలాలు |
| సేరి | వ్యవసాయం |
| సొంకా | పెవ్‌మెంటు |
| సొక్కారొట్ట | పుల్కా |
| సొగాడులు | ఒకరకం పిండివంట |
| సొట్ట | కుంటి |
| సొత్తు దుంపలు | ముల్లంగి దుంపలు |
| సొమ్ము | డబ్బు |
| సొమ్ములు | పశువులు |
| సొమ్ములు కాపరి | పశువుల కాపరి |
| సొమ్ములు పూయు | బండికి ఎడ్లు కట్టడం |
| సొసయ్‌టి | సమాజం |
| సోద్దెం | చిరుతిండి |
| సోలెడు | ఒక కొలత విశేషం |
| స్పెసిమెన్ సిగ్నేచర్ | నమూనా సంతకం |
| స్లాబ్ | ఇంటిమీద సిమెంటు కప్పు |
| హంగు చెయ్యి | సరదా చెయ్యడం |
| హంగుదార్లు | సహాయం చేసేవాళ్లు |
| హస్బెండ్ | భర్త |
| హస్తం | అయిదు రూపాయలు |
| హేండ్‌రయ్‌టింగ్ ఎక్స్‌పెర్ట్ | చేతివ్రాత నిపుణుడు |
| హుండా | విభాగం |

# గ్రంథ సూచిక

1. ఆంధ్రప్రదేశ్ 1981 జనాభాగణాంకాలు, వైద్యప్రజారోగ్యశాఖ,కుటుంబ సంక్షేమ విభాగము.
2. ఆంధ్రప్రదేశ్ దర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976.
3. శ్రీకాకుళంజిల్లా చరిత్ర, ఆదిభట్ల వేంకటరమణ, తెలుగు ప్రపంచసభల జిల్లాస్థాయీసంఘ ప్రచురణ, 1975.
4. శ్రీకాకుళం ప్రజల భాష, వి. సి. బాలకృష్ణశర్మ, 1975.